# చతుర

సంపుటి : 5    ఫిబ్రవరి 1982    సంచిక : 1

## ఈ నెల సమగ్ర నవల

అదురూ బెదురూ లేని పధ్నాలుగేళ్ల వయసు అతనిది. ఆ వయసుకే అతగాడో పెద్ద హీరో! వూరిలోని అల్లరిమూకకి నాయకుడు. అలాంటివాణ్ని అందమైన పదిహేడేళ్ల పడుచు చేరదీసి ఆదరించింది. తమ్ముడిలా వున్న అతన్ని తనువులో సగభాగం అని నమ్మి — అతని చేత తాళిబొట్టు కట్టించుకొంది. మనసుకు చిన్నాపెద్దా భేదం లేదని—

# ప్రేమ

తత్వానికి అంతస్థులు అడ్డురావని వూహించిందామె. పెళ్లి చేసుకొని కాపురం కూడా చేసింది. ఈ విషయం అటు పిల్లవాడి పెద్దలకు కాని, ఇటు పిల్లదాని పెద్దలకు కాని తెలియక పోవడం విచిత్రం! తర్వాత ఏం జరిగింది? ఏయే పరిణామాలు ఏర్పడ్డాయి?

## కె.ఆర్.విశ్వం

ఆసక్తికర చిత్రణ 'ప్రేమ' ఈ నెల చతుర సమగ్ర నవల



ముఖచిత్రం : జిగ్ మోహన్

రెండవ, మూడవ కవర్లు : బ్రహ్మదేవ్

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

# పక్కింటావిడ

కంచంలో అన్నీ వడ్డించి ఎదురుగా మోకాలిమీద తలానించి కూర్చున్న సుజాత ఎంతో ముద్దుగా కనబడింది రాంబాబుకి.

"సుజా! రేపేగా మన పెళ్ళిరోజు!" మురిపెంగా అడిగాడు వేడివేడి అన్నంలో పప్పు కలుపుతూ.

సమాధానంగా ముసిముసి నవ్వులు విసిరింది సుజాత.

పరవశించి పోయాడు రాంబాబు. "కొత్తచీర తెచ్చుకుందువుగాని యివాళ. రెండు వందలిస్తాను చాలా?" అన్నాడు వుషారుగా.

"రెండువందలే...!" అంది సుజాత కళ్ళు విప్పార్చుకుని.

"మరేమిటనుకున్నావు డియర్! మొదటి పెళ్ళిరో..."

"సుజాతగారూ ...!" గాలిలో తేలివచ్చింది పిలుపు. చేతిలో వున్న నేతి గిన్నె ఠక్కున కిందపెట్టేసి "క్షణంలో వస్తా. తింటూ వుండండి" అంటూనే పరుగు పెట్టింది పెరట్లోకి.

ఒళ్లు మండిపోయింది రాంబాబుకి. చక్కటి సన్నివేశం పాడుచేసింది. ఆవిడకి లేకపోతే దీనికి బుద్ధుండక్కర్లా! వేళాపాళాలేదు. సమయం సందర్భంలేదు. "సుజాతగారూ!" అని పిలవడం ఆలస్యం లేడిలా దూసుకు పోతుంది ఎంతపనిలో వున్నాసరే. ఛీ. ఛీ! ఎన్నాళ్ళిలాగా! సహనానికైనా ఒకహద్దుంటుంది.తన కోపమంతా అన్నం మీదా, గిన్నెల మీదా చూపిస్తూ తినసాగాడు రాంబాబు.



"సాయంత్రం సినిమా కెళదాం రెడీగా వుండు" అంటే ఎగిరి గంతేసేదల్లా "నేనూ, ప్రమీలగారూ మ్యాట్నీ కెళదామని అనుకున్నామండీ" అనడం వరకూ వచ్చింది ఈమధ్య. సినిమాలేనా! షికార్లు, షాపింగులు అన్నీ ఆవిడతోనే. ఎంతో రొమాంటిక్ మూమెంట్‌లో వున్నాసరే 'సుజాతగారూ' అన్న పిలుపు విన్నదంటే చాలు విదిలించుకుని పోతుంది.

తన అయిష్టాన్ని మొహంలో భావాల







ద్వారా ప్రకటించేవాడు మొదట్లో. వుఁహు తెలుసుకోలేకపోయింది. సరే! మృదువుగా మందలించాడు. అబ్బే! లెక్క చెయ్యందే అసలు. సామ దాన బేధాలన్నీ ప్రయోగించాడు. ఫలితం శూన్యం. మిగిలింది దండోపాయం. అది తనలాంటి సంస్కారవంతులు చేయతగింది కాదు గదా!

ఆలోచిస్తున్న కొద్దీ అతని ఒళ్ళు దహించుకుపోసాగింది. ఆఫ్టరాల్ ఒక ఆడదాన్ని ఓడించలేకపోతున్నాడు. ఆ ప్రమీల తెలివే తెలివి. హుఁ!

పెరట్లోంచి వినవస్తున్న నవ్వులు అగ్నికి ఆజ్యం పోస్తున్నట్లుగా వుందప్పుడు. "సుజా! పెరుగు" రంకెవేశాడు పెద్దగా.

"ఏంటండీ ఆ కేకలు! అన్నీ అక్కడే పెట్టాగా" సాగదీసుకుంటూ వచ్చింది సుజాత.

"ఏమిటట అంత రాచకార్యాలు వేళా పాళాలేకుండా"

"మేగజైన్‌లో ఏదో జోక్ తెగనవ్వు తెప్పించిందట. నాకు చూపించాలని చదువుతూ చదువుతూ వున్నదల్లా వచ్చేసింది. ఏ చిన్న విషయమైనా వెంటనే నాతో చెప్పాల్సిందే..."

"అఘోరించలేకపోయిందీ" కంచంలో చెయ్యికడిగి లేచాడు విసురుగా.

ఆఫీసుకెళ్ళినా ప్రమీల గురించి ఆలోచించడం మానలేదు రాంబాబు. ఆమెనెలా వదిలించుకోవాలో పాలుపోక బుర్ర వేడెక్కిపోసాగింది.

"ఈ కథ చదివావుటోయ్ రాంబాబూ?" పక్కసీట్లో వున్న రఘు కొత్త విపుల తెచ్చాడు. పేజీలు విప్పి కథ చూపెడుతూ "చాలా ఫన్నీగా వుంది చదవ్వోయ్. ఐదు నిమిషాల్లో అయిపోతుంది" అంటూ పత్రిక చేతిలో పెట్టాడు రఘు.

చదువుతూ చదువుతూ ఆలోచనలో పడ్డాడు. ఆహా! యిది తన కథే. రచయిత ఎవరోగాని తన కోసమే రాశాడు. అవునవును. ఈ ట్రిక్ ప్రయోగించాలి. అసూయకు మారుపేరు స్త్రీ. దానితోనే ఆ ప్రమీలారాణి పీడ విరగడ చేసుకోవాలి.

# ఉష్ . . . రహస్యం చెప్తున్నాం . . .

# వినండి . . .



కొందరు స్త్రీలు పెరిగే ధరలకంటె ముందడుగు వేసి జీవితంలో చిన్న చిన్న సుఖాలను అనుభవిస్తున్నారంటే, మీకాశ్చర్యంగా లేదా? అది ఎలా సాధ్యమో **కెనరా బ్యాంకు** మీకు చెప్తుంది.

సద్దు లేకుండా, పొదుపు చేసి కొన్నాళ్ల తర్వాత ఆ డబ్బుతో మీ కుటుంబానికి ఆశ్చర్యానందాలు కలిగించాలని ఉబలాటపడే మీలాంటి గృహిణులకే మా **కాలక్షేమ డిపాజిట్** పథకాన్ని ఆరంభించాం. మీ నిత్యకృత్యాలలో ఎదురయ్యే కొన్ని ఆర్థిక ఇబ్బందులు మీరు దాచిన ఈ డబ్బుతో సమసి పోతా యి.

ఇప్పుడు మీకుకూడా అలాంటి "గృహిణిగా" మారాలి.

"చిల్లర డబ్బులు" అని ఉపేక్షచేయకండి. గప్‌చిప్‌గా ఆకర్షణీయమైన మా **కాలక్షేమ** టి. వి. డబ్బా లో ఆ చిల్లరను వెయ్యండి. ఈ రహస్యం మీకు తెలీకుండానే ఒక పెన్నిధిగా మీకు అందవచ్చి ఆనందాని కల్గిస్తుంది. ఇప్పుడు చూస్కోండి . . . మీకొక అందమైన చీర — మీ అబ్బాయికి సైకిలు — లేదా మీ యింటికొక ప్రత్యేకతనిచ్చే వస్తువేదైనా కొనగలరు కదా!

మీ చిన్నరహస్యాన్ని పెద్ద పెన్నిధిగా మార్చండి.

మా యితర పథకాలు

**కామధేను**

**నిరంతర**

**విద్యానిధి**

# కెనరా బ్యాంక్

(జాతీయ బ్యాంక్)

దేశము మొత్తమున 1,300 కు పైగా శాఖలు కలవు.



క్షణం ఆలస్యం చెయ్యకుండా ఫైల్లు సర్దేశాడు. ఆ పూటకి సెలవుపెట్టి యింటి దారి పట్టాడు వెయ్యేనుగుల బలంతో.

* * *

టాపు లేచిపోయేలా నవ్వులు వినిపిస్తున్నాయి యింట్లోంచి. చెప్పులు చప్పుడు చేసుకుంటూ లోపలికొచ్చాడు రాంబాబు.

అతన్ని చూస్తూనే ప్రమీల లేచి తన పోర్షను వైపు వెళ్ళిపోయింది. "అరే! ఆవిడ వెళ్ళిపోతున్నారే. వుండమను. నేను గదిలో కూర్చునేవాణ్నిగా" నొచ్చుకొన్నాడు రాంబాబు.

"పర్వాలేదుగాని. యిప్పుడొచ్చారేంటి? మేం బజారు కెళ్ళబోతున్నాం యిప్పుడు" అంది సుజాత.

"అందుకేగా యింత హడావుడిగా పరుగెత్తుకొచ్చాను. ఎలాంటి చీర కొనాలో ప్రొద్దున చెప్పడం మర్చిపోయాను. చూడు; మొన్న శుక్రవారం ప్రమీలగారు తలంటి పోసుకుని కట్టుకున్నారే గులాబిరంగు చీర..."

నొసలు చిట్లించింది సుజాత. తనకే గుర్తులేదు ఆ విషయం.

"అదేనోయ్. లేతగులాబిరంగు మీద ముదురు గులాబిరంగు పువ్వులుంటాయి. ఆఁ గుర్తు వచ్చిందిగా. అదేరకం చీర తేవాలిసుమా. కాస్త ఆలస్యమైనా సరే నాలుగు షాపులు తిరిగి తెండి. ఆవిడ పర్సనాలిటీకూడా బాగుంటుందేమో కళ్ళు తిప్పుకోలేక పోయాననుకో ఆ రోజు. అప్పట్నించీ నీక్కూడా అలాటి చీరే కొనాలని ఉందిలే. నిజానికి అవయవ సౌష్ఠవం వున్న వాళ్ళు ఏచీర కట్టినా అద్భుతంగా వుంటుందనుకో. ఆవిడకి ముప్ఫయ్ ఏళ్లంటె నమ్మలేక పోయాను. నీకంటె చిన్నదానిలా..."

"హూఁ సరేగాని కాఫీతెమ్మంటారా?" అసహనంగా అడిగింది సుజాత.

"అలాగే కాఫీతోపాటు ప్రమీలగారు పెట్టిన స్వీటుంటె పట్రా. చాలా బాగుంది, క్రొత్తరకం కాబోలు. యిన్నాళ్ళనించి స్నేహం చేస్తున్నావు ఒక్కపనీ నేర్చుకోలేకపోయావు ఆవిడ దగ్గర" చివరి మాట తనలో తను అనుకున్నట్లు అన్నాడు రాంబాబు.

టక్ మన్న పెద్దచప్పుడుతో కాఫీ గ్లాసు బల్లమీదికొచ్చింది. మొహం కందగడ్డలా చేసుకుని నిలబడ్డ భార్యని వోరగా చూసి చిన్నగా నవ్వుకున్నాడు తనలో. గ్లాసు చేతిలోకి తీసుకుని వక్కచుక్కే సిప్ చేస్తూ "ప్రమీలగారి హెయిర్ స్టయిల్స్ బాగుంటాయి సుజా. యివాళ ఆమెతో దువ్వించుకో తల..."

పెరట్లోంచి సిగ్నల్ "సుజాతగారూ" అని.

"ఆవిడ తయారయి వచ్చినట్లున్నారు చూడు. నువ్వేమో యింకా అలాగే వున్నావు. పనిలో ఎంతచురుకో ఆవిడ. పోనీ నేనుకూడా రానా?"

భర్తని చురచుర చూస్తూ గబగబా వెళ్ళింది పెరట్లోకి సుజాత.

"ఏంటండీ! నన్ను తొందర చేసి మీరింకా అలాగే వున్నారు? త్వరగా తెములండి మరి" అంటోంది ప్రమీల.

"సారీ అండీ, మావారేమో మనిద్దరం వెళదాం బజారుకి. అటునించటె సినిమాకి కూడా వెళ్దాం అంటున్నారు. ఏమనుకోకండేం" అంటూ సుజాత చెప్తున్న సమాధానం విని రాంబాబు హాయిగా నవ్వుకున్నాడు.

—జి. సరస్వతి



# ఘోస్ట్

సుబ్బయ్య పేరు బాగా లేకపోయినా అతడికి మిగతావన్నీ బాగానే ఉన్నాయి. ఆ పేరు కలిసొచ్చిందని అతను ఎందరు చెప్పినా మార్చుకోలేదు.

ఆస్తి తప్ప మరే అందమూలేని అతడు తలిదండ్రులకు ఏకైక వంశాంకురం. ఆ వంశాంకురంనుంచి రానున్న అంకురాలు అందచందాలతో వెలిగిపోవాలని అతని తల్లిదండ్రుల ఆశ. సుబ్బయ్య పిల్లలకు అందం రావాలంటే అందమైన పెళ్ళాం తప్ప మరో మార్గంలేదు. అందుకని ఓ అపురూప సౌందర్యవతికి భర్త కాగలిగాడు. డబ్బుంటే ఏది రాదు గనుక.

తన పేరు విరివిగా ప్రచారం పొందాలని సుబ్బయ్య తపన. తను తెచ్చుకో



లేని పేరు తన కొడుకు తెచ్చుకున్నా చాలన్నది అతడి కోరిక. అయితే అతడికి సంతానం కలగడంలేదు. సంతానం కోసం చాలామంది దేవుళ్ళకు మొక్కాడు. డాక్టర్ల చుట్టూ తిరిగాడు. ఫలితం కనబడలేదు.

అన్ని విధాలా నిరుత్సాహపడి ఉన్న సుబ్బయ్య ఇంటికి రమణ వచ్చాడు.

రమణ ఆ యింట్లో వారం రోజులుండి సుబ్బయ్య సంపదలు పల్లెటూళ్ళో వృధా అయిపోతున్నాయని బాధపడ్డాడు. డబ్బుంటే ఈ రోజుల్లో ఎంత పేరైనా సంపాదించుకోవచ్చునని రమణ అనగానే ఆత్రపడిపోయిన సుబ్బయ్య "ఒక్క ఉపాయం చెప్పు నాకు!" అన్నాడు.

"సినిమా తియ్" అన్నాడు రమణ.

రమణ సుబ్బయ్యకు వరుసకు తమ్ముడౌతాడు. అతన్ని నమ్మి మద్రాసుకు మకాం మార్చాడు సుబ్బయ్య.

ఫలితం చాలా తొందరగానే కనబడింది. సుబ్బయ్య పేరు పేపర్లో పడింది. చాలామంది అతడిచుట్టూ తిరగసాగారు. ఎందరో ఆడపిల్లలు వేషాల కోసం ఏకాంతంలో కూడా కలుసుకుని అతడి అందాన్ని పొగిడి తమ అందాల నతడికర్పించడానికి తహతహలాడారు.

నిర్మాత సుబ్బయ్య తీసిన తొలి చిత్రం విడుదలయింది. చిత్రానికి కాస్తో కూస్తో పేరుకూడా వచ్చింది. సుబ్బయ్యకు పెట్టుబడి పోనూ రెండు లక్షలు లాభం మిగిలింది.

ఈ విధంగా తనపేరు దేశమంతటా మోగిపోతుందని సుబ్బయ్య ఆశించాడు కానీ ఊహించినంతగా మాత్రం అతడికి పేరు రాలేదు. చిత్రంలోని నటీనటులకీ, దర్శకుడికీ, సంగీత దర్శకుడికీ, కథా రచయితకూ వచ్చినంతగా తనకు పేరు రాలేదు. అదేమాట అన్నాడతను రమణతో.

రమణ బాగా ఆలోచించి "ఈసారి తీయబోయే చిత్రానికి కథ నువ్వే రాయి" అన్నాడు.

"నేను కథ రాయగలిగితే పేరుకోసం నిన్నెందుకాశ్రయిస్తాను?" అన్నాడు సుబ్బయ్య.

రమణ నవ్వి "కథ నువ్వే రాయక్కర్లేదు. పేరు మోసిన రచయితలెందరో దేశంలో ఉన్నారు. ఓ రెండు వేలు నీవి కావనుకున్నావంటే నీ పేరనే వాళ్ళు కథ రాసిస్తారు" అన్నాడు.

తర్వాత ఇద్దరూ కలిసి ఓ మహా రచయిత దగ్గరకు వెళ్లారు. ఆయన ఎగిరి గంతేసి మరీ కథ రాసిచ్చాడు.

"నీ కథ చాలా బాగుంది. ఈ పిక్చర్ హిట్టయితే ఇకనుంచీ సుబ్బయ్యగారికి నువ్వే పెర్మనెంట్ ఘోస్ట్ రైటర్‌వి" అన్నాడు రమణ రచయితతో.

ఈ రెండో చిత్రం కూడా హిట్టయింది. ఈ చిత్రంలో కథ కంటే సంభాషణలకు పేరెక్కువ వచ్చింది. దాంతో తర్వాత చిత్రానికి సుబ్బయ్య ఓ ఘోస్ట్ డైలాగ్ రైటర్ని కుదుర్చుకున్నాడు.

అలా అయిదారు చిత్రాలు గడిచేసరికి సుబ్బయ్యకు దేశంలో చాలా పేరు వచ్చింది. అతడిప్పుడు చిత్ర నిర్మాత మాత్రమే కాక కథకుడు, సంభాషణల రచయిత, దర్శకుడు, పాటల రచయిత కూడా అయ్యాడు.

"కథ, మాటలు, పాటలు, స్క్రీన్‌ప్లే, నిర్మాత, దర్శకుడు-సుబ్బయ్య" అన్న ప్రకటనను పేపర్లో చూసినపుడల్లా సుబ్బయ్య తనలో తనే ముసిముసిగా నవ్వుకుని ఆ పోస్టర్ల మీద జాలిపడేవాడు. ఒకరోజు సుబ్బయ్య ఏదో షూటింగుకని వెళ్ళి అనుకోకుండా అది కాన్సిలవడం వల్ల వెంటనే ఇంటికి తిరిగి వచ్చాడు. అతను తిరిగి వచ్చేసరికి గదిలో భార్య ఒంటరిగాలేదు. అందమైన ఓ యువకుడి బాహుబంధాల్లో ఉంది. సుబ్బయ్యను చూస్తూనే ఆ యువకుడు కంగారుపడి దొడ్డిదారిన పారిపోయాడు.

"ఎవడు వాడు?" అన్నాడు సుబ్బయ్య ఉద్రేకంతో ఊగిపోతూ.

అతడి భార్య తలవంచుకు నిలబడింది. వంచిన తల ఎత్తలేదు. పెదవి విప్పి మాట్లాడలేదు.

"ఇదంతా ఏమిటో చెప్పు"

"చెప్పడానికేముంది? ఇన్నేళ్ళయి మన పెళ్ళి జరిగినా మనకింకా సంతానంలేదు. అంతా మీ గురించి ఏదోలా అనుకుంటూంటే వినలేక అతని పరిచయం పెంచుకున్నాను. అతనివల్ల సంతానవతినైతే మీకున్న చెడ్డపేరు పోతుందని అనుకున్నాను. నాకిప్పుడు మూడవ నెల" అన్నదామె నెమ్మదిగా.

"నామీద అంత ప్రేమున్నదానివి ఈ విషయం నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" భార్య తన నేరాన్ని కప్పిపుచ్చుకునేందుకు ఏదో కథ అల్లుతున్నదని అతడికర్థమయింది.

ఆమె జవాబివ్వలేదు.

"ఇంతకీ ఎవడువాడు?"

"మీ ఘోస్ట్ హజ్‌బెండ్!" అందామె.

—వసుంధర



# ప్రేమ



_కె.ఆర్. విశ్వం

"నా గోలీకి తగల్లేదు" అన్నాడు మోహన్ చేతులు పైకెత్తి.

"ఏయ్! తగిలింది. మర్యాదగా పదిహేను బీడీలివ్వు" శంకర్ చేతులూపుకొంటూ మీదిమీదికొచ్చాడు.

"ఎలావుంది వొళ్లు. తగల్లేదని చెప్తుంటే నీక్కాదూ! మర్యాదగా బీడీలివ్వు. ఒరేయ్ బుచ్చీ! నువ్వుకూడా" జబర్దస్తీ చేస్తున్నాడు మోహన్.

"ఛ! ఛ! అన్నీ అబద్ధాలే. నీతో గోలీలాటే ఆడకూడదు. ఉట్టి అబద్ధాల పోగు" తన గోలీల్ని ఏరుకుంటూ శంకర్ ఇంటికి పారిపోబోయాడు. వెనక నుండి చొక్కాపట్టి నిలిపాడు మోహన్.

"ఏరా! తిక్క వదలగొట్టాలా! నువ్వు గెలిస్తే ఫర్వాలేదు. నేను గెలిస్తేనే అబద్ధాలా?! మర్యాదగా బీడీలు తియ్యి" అంటూ శంకర్ని కాలుపట్టి లాగి కింద పడేశాడు. జేబులన్నీ వెతికి బీడీలన్నీ లాక్కున్నాడు. కాలితో ఓ తాపు తన్ని— "పో! నీ దిక్కున్న చోటికి పో!" అంటూ పక్కకి తిరిగి చూశాడు.

శంకర్కి జరిగిన శాస్తి చూడడంతో బుచ్చి, తనకు కూడా తన్నులు తప్పవని పరుగు తీశాడు. "నిలబడ్రా!" అని వెంట తరిమాడు మోహన్. అయినా దొరక్కుండా పారిపోయాడు బుచ్చి.

చెట్టుకింద శంకర్ కళ్లు నులుముకొంటూ కూర్చున్నాడు ఏడుస్తూ. రమణ దగ్గరగా వచ్చాడు. "ఎందుకురా ఏడుస్తున్నావ్?" అనడిగాడు.

అటు వాణ్ని అడుగుతున్నాడో లేదో, ఇటు మోహన్ దూకుడుగా వచ్చి— "నీ దగ్గరెన్ని వున్నాయిరా బీడీలు?" అంటూ నిలదీశాడు.

అసలు సంగతి తెలియక "ఓ పది కట్టలున్నాయి" అన్నాడు రమణ. శంకర్ ఎందుకేడుస్తున్నాడో తెలిసుంటే, బీడీల గురించి చెప్పడం సంగతలా ఉంచి ముందు అక్కణ్నుంచి పారిపోయేవాడు.

రమణవైపు ఎర్రగా చూస్తూ— "నిన్న నా దగ్గర అయిదు బీడీకట్టలు గెల్చుకున్నావ్ కదా!" అనడిగాడు మోహన్. తలూపాడు రమణ నిజమేనన్నట్లు.

"నీయబ్బ... దొంగాటాడి నా దగ్గర కాజేసేవు కదరా బీడీలు" అన్నాడు ఉరిమిచూస్తూ.

"ఓహోయ్! దొంగాటాడ్డం నాకు చేతగాదు. అవన్నీ నీకే తెలియాలి. ఏంటి సంగతి" అన్నాడు బెదిరింపుగా.

మోహన్ మాట్లాడలేదు. రమణని మెడ పట్టి కిందికి తోశాడు. వాడి దగ్గరి బీడీలని కూడా లాక్కున్నాడు. రమణ ఏడుస్తూ మోహన్ కాళ్లు పట్టుకున్నాడు. జాడించి తన్ని అక్కణ్నుంచి పరుగు లంకించుకున్నాడు మోహన్. వెనక్కి తిరిగి చూడకుండా వచ్చి గడ్డివామి ఉన్న దొడ్లోకి చేరుకున్నాడు. ఇటు అటు చూసి ఎవరూ లేరని నిర్ణయించుకున్నాక నింపాదిగా ప్రహరీ గోడనానుకుని కూర్చున్నాడు. బీడీలన్నీ తీసి లెక్కేస్తున్నాడు.

మోహన్ దొడ్లోకి వెళ్లడం, బజారు నుండి అప్పుడే వస్తోన్న వేణు చూశాడు. మోహన్ పెత్తల్లి కొడుకు వేణు. దొడ్లోకి పరుగెత్తుతూ వెళ్లడం చూసి, ఇక్కడేదో కిటుకుందని వెంటబడి ప్రహరీ గోడకి ఇటుగా నిలబడి కాళ్లెత్తి లోపలికి చూశాడు. మోహన్ బీడీల్ని కట్టలుగా కట్టి జాగ్రత్త చేస్తున్నాడు.

చప్పుడు కాకుండా మెల్లగా గేటు దగ్గిరగా వచ్చి లోనికి తొంగి చూశాడు

వేణు. వాణ్ని చూస్తూనే బీడీలన్నీ గడ్డి కిందికి తోసేశాడు మోహన్.

"ఎక్కడివిరా ఇన్ని బీడీలు ?" దగ్గరగా వచ్చి కూర్చొంటూ అడిగాడు వేణు.

"ఆటలో గెల్చుకొన్నాను"

"నాకో కట్ట ఇవ్వు! తాగడానికి బీడీ ల్లేవు. తర్వాతిస్తాను"

అడ్డంగా తలూపాడు మోహన్. వాడు లాక్కుపోడానికి వచ్చాడని తెలిసి జాగ్రత్త పడుతున్నాడు.

"ఇవ్వవా అయితే"

"ఇవ్వను"

"అయితే చూడు. టీచర్‌కన్నీ చెప్పేస్తా" బెదిరించాడు.

"టీచర్‌కాదు!వాడి బాబుకిచెప్పుకో" అన్నాడు కసురుకొంటూ.

అదును చూసి తటాల్న గడ్డి మీదపడి రెండు కట్టలు లాక్కొని పరుగెత్తాడు వేణు. మోహన్ గట్టిగా ఏడుస్తూ కూర్చు న్నాడు. బీడీ కట్టలు పోయినందుక్కాదు ఆ ఏడ్పు! మళ్లీ వాడురాకుండా. అయితే వేణు మళ్లీరాలేదు. 'హమ్మయ్య' అను కొన్నాడేమో-తిరిగి బీడీల్ని లెక్కించడం మొదలు పెట్టాడు మోహన్. మొత్తం పదిహేను కట్టలు ! విరిగినవి కొన్ని పక్కన పెట్టాడు. నిన్న పది, ఈ రోజు మూడుకట్టలు ఆటలో నష్టం. మొత్తం నిన్నా, ఈ రోజు కలిసే నాలుగు కట్టలు లాభం. అందులోనివే వేణు రెండు లాక్కుపోయాడు.అయినా సంతోషంగానే వుంది మోహన్‌కి. సాయంత్రం మళ్లీ ఆట్లాడి పోయిన రెండూసంపాదించొచ్చు. మిగిలిన బీడీల్ని శెట్టికి వాపసు ఇచ్చేయా లనుకున్నాడు.

ఈ వారంలో నష్టంలేదు. శెట్టి బీడీలు బదులిస్తాడు. మోహన్ తండ్రికి ఆ కొట్లో ఖాతా వుంది. తండ్రి పలుకుబడి కలిగిన మనిషి. పైగా మోహన్ రోజుకు రెండు సార్లయినా వేరుసెనక్కాయలు తీసుకెళ్లి శెట్టికొట్లో తూకంవేసి జీళ్లు కొనుక్కుం టాడు.ఈ పరిచయాలవల్ల బీడీలు ఖరీదుకు గాక చేబదులుగా దొరుకుతాయి. చేబదులు తెచ్చినవి చేయి మీరిపోతే మరిన్ని వేరు శనక్కాయలు దొంగతనంగా కొలుస్తాడు శెట్టికి.

మోహన్ ఇంటి పక్కనే గడ్డివామి. రెండింటి మధ్య ఎరువు దిబ్బ మాత్రం అడ్డు! మోహన్ ఏడ్వడం, వేణు పారి పోవడంఇంట్లోవున్న జగన్నాధంచూశాడు. ఎందుకేడుస్తున్నాడో చూద్దామనివాడ్లోనికి వచ్చాడు. ఆపాటికి బీడీలన్నీ గడ్డికిందకి తోసి, విరిగిన బీడీ నొకదాన్ని తాగుతూ చిద్విలాసంగా కూర్చ్వున్నాడు మోహన్. ఇదంతా చూశాడు జగన్నాధం"ఒరేయ్!" అన్నాడు కోపంగా.

ఆ అరుపుకి తుళ్లిపడ్డాడు. లేచి పరు గందుకొని ప్రహరీ గోడ దూకి పారి పోయాడు. ఆ ఊపులో ఊరవతలి గుడి దగ్గరికిచేరుకున్నాడు.అది పేరుకుగుడేకాని గుడిలా కన్పించదు. పాడుబడ్డ వసారాలా వుంటుంది. అక్కడక్కడ పెద్దపెద్ద రాళ్లు, వేపచెట్టూ- అదంతా రాత్రిపూట చూస్తే భయం వేసుంది. గుడిలో ఎర్ర కంచెమ్మ పక్కనే పోతురాజు బొమ్మ! వాళ్లిద్దరూ అక్కా తమ్ముళ్లట.

మిట్టమధ్యాహ్నం ఎండపొడ తీవ్రంగా వుంది. అక్కడి రాళ్లమీద కూర్చు న్నాడు. జేబులో చెయ్యిపెట్టి వెతికితే అగ్గిపెట్టె వుంది. కాని బీడీల్లేవు. వేప చెట్టు నీడ చల్లగా వుంది. అటూ ఇటూ

# ప్రియ తోడుగా ఉంటే చాలు... మరింత సంతృప్తి!




బ్రేక్‌ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ' ఆకర్షణలోని రహస్యం. నోరూరించే పలురకాల పచ్చళ్ళలో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300, 650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004

KIRON/PF 812 111

చూశాడు. మనుషులెవరూ కన్పించలేదు. నిశ్చింతగా వూపిరి పీల్చి నిద్రకి ఉపక్రమించాడు. ప్రత్యేకంగా అక్కడికి వచ్చి చూస్తేనే గాని గుడిలోపలి వ్యక్తి రోడ్డు మీదికి కన్పించడు. అలా ఎంతసేపు పడుకొన్నాడో...!

లక్ష్మి అంతా వెతుకుతోంది. ఎక్కడా కన్పించట్లేదు మోహన్. పిల్లలంతా గోలీలాడుకుంటున్నారు. బొంగరాలు తిప్పుకుంటున్నారు. చెమ్మచెక్కా వేసుకుంటున్నారు. అక్కడున్న వాళ్లని అడిగితే-'మాకుతెలీదంటేమాకుతెలీదన్నారు'. కొందరైతే చూడలేదని చెప్పారు. అక్కడనుండి సరాసరి గుడి దగ్గరి కొచ్చింది. గుడి దగ్గరగా వచ్చి కాళ్లు పైకెత్తి వేళ్లమీద నిలబడి లోనికి చూసింది. హాయిగా నిద్రపోతున్నాడు మోహన్. పరికిణీ కుచ్చెళ్లని ఎత్తిపట్టుకుని మోహన్ తల దగ్గరగా వచ్చి తట్టి లేపింది.

ఉలిక్కిపడి లేచి పరుగు తీయబోయాడు. అయినా తమాయించుకుని చూస్తే ఎదురుగా లక్ష్మి.

"నువ్వా!" అన్నాడు ధైర్యం కూడదీసుకుంటూ.

"నీ కోసం అంతా వెదికాను. ఎక్కడా కన్పించలేదు. అయితే ఇక్కడే వుంటావనుకున్నాను. రా ఇంటికి పోదాం" అంది చెయ్యిపట్టి లాగుతూ.

చెయ్యి విదిలించాడు. "రాను! నువ్వు పో! తర్వాతొస్తాను"

"అయితే నేనూ వెళ్లను" అంది మూంగమూతి పెట్టి.

"వెళ్లకపోతే తంతాను. నా సంగతి తెలుసుగా!" అన్నాడు కళ్లెర్రజేస్తూ.

లక్ష్మి చప్పట్లు చరిచి నవ్వింది "భలే. భలే. బావా! నీ కళ్లెంత బాగున్నాయో!!" అంది. జడపట్టి మీదికి లాగి ముక్కుపట్టి గట్టిగా నలిపాడు. ఆ దెబ్బకి లక్ష్మి ఏడుపు అందుకుంది.

"మామయ్య రమ్మంటున్నాడు నిన్ను" అంది లేచి నిలబడి.

"రానన్నానుగా!"

"ఇక్కడే వుంటావా ఎప్పుడూ?"

"నా ఇష్టం! వుంటే వుంటాను. లేకపోతే పోతాను. ముందు నువ్వెళ్లు"

లక్ష్మి వెళ్లనంది. అప్పుడే అటుగా పోతున్న వీరయ్యను కేకేసింది - రమ్మనంటూ. వీరయ్య దగ్గరగా వచ్చాడు.

"ఆలుమగలు ఇక్కడున్నారేమిటి" అన్నాడు నవ్వుతూ.

"మరే మా బావ ఇంటికి రానంటున్నాడు. మామయ్య పిల్చుకురమ్మన్నాడు" అంది.

"లే బాబూ! అలకలు చాలించి ఇంటికి పో!"

"ఏం! వళ్లిలా వుందేం! నీ తోవన నువ్వు పో! అంతేగాని నాకేం చెప్పకు" మోహన్ తలెగరేసి బింకంగా అన్నాడు.

"ఆఁ! అలాగా! సరే ఇక్కడే వుండు రాత్రయితే కంచెమ్మ నిన్ను చంపేస్తుంది"

"ఓస్! మన దగ్గర అలాంటి పప్పులుడకవు. నేనే దాన్ని చంపేస్తాను"

పాపన్న దారంట పోతూ అటుగా వచ్చాడు.

"ఏమిటి సంగతి" అన్నాడు ముగ్గుర్నీ చూస్తూ.

"ఈ తలబిరుసు కుర్రాడు తండ్రితో పోట్లాడి ఇక్కడికొచ్చాడు. పాపం పెళ్లాం.. ఇప్పట్నుంచే వెతుకులాడుతోంది ఇతగాడి కోసం" అన్నాడు వీరయ్య తమాషాగా లక్ష్మివైపు చూస్తూ. లక్ష్మి

మోహన్ వైపు చూస్తూ నిల్చుంది.

"ఇంటికి రా పోదాం" అన్నాడు పాపన్న లాలనగా.

"నేన్రాను. ఇక్కడే వుంటాను"

"మీ నాన్న కొట్టడులే. నే చెబుతాగా!"

రానన్నట్లు తల అడ్డంగా వూపాడు.

"ఎత్తుకుపోతాను రానంటే"

నిజంగానే అంతపనీ చేసాడని మోహన్‌కి తెలుసు. అందుకే చప్పున లేచి గుడి దాటి పొలాల్లోకి పరుగు లంకించుకొన్నాడు. కాని వెంటబడి పట్టుకొన్నాడు పాపన్న. ఇంటికి ఈడ్చుకొంటూ తీసుకు వెళుతున్నాడు. మోహన్ గింజుకొంటూ పారిపోవడానికి ప్రయత్నిస్తున్నాడు. లక్ష్మి వెనక నవ్వుతూ తోడుగా వస్తోంది.

ఇంటి దగ్గరికి రాగానే చావబాదాడు జగన్నాథం "బీడీలు తాగుతావా" అంటూ. దెబ్బలుతిన్నా లెక్కచెయ్యలేదు మోహన్. జవాబివ్వకుండా మంచంలో పడుకొన్నాడు.

"పిల్లాడు లేవయ్యా! ఇవన్నీ ఇలాగే వుండిపోతాయా ఏం" అన్నాడు పాపన్న.

"ఇప్పటి అలవాట్లే రేపు ప్రాణం తీస్తాయి. ఈ రోజు ఇలా అని వూరుకొంటే రేపు మితిమీరిపోతాడు" జగన్నాథం కోపగించుకొన్నాడు.

లక్ష్మి బిక్కమొహంతో ఇంటికి వెళ్ళిపోయింది. తాను తప్పు చేసిందేమోననుకొంది.

* * *

ఉదయం ఎనిమిదిన్నరకి స్కూలు తెరిచాడు టీచర్. అయన్ది ఆ వూరు కాదు. పక్కనున్న పల్లెలో ఉంటున్నాడు. ప్రతి శనివారం మధ్యాహ్నం వెళ్ళి, సోమవారం ఉదయం వస్తాడు. స్కూల్లో ముప్పై మందికి పైగా పిల్లలున్నారు. అందర్లోనూ ఇంతో అంతో తెలివితేటలున్న మోహన్‌ని క్లాస్ లీడర్ని చేశాడాయన. శనివారం వెళ్ళూ, ఆదివారం రోజు అల్లరి చేసిన వాళ్ళందరి పేర్లూ రాసి సిద్ధం చేయమంటాడు. ఆ పని మోహన్దే. అయితే ఆ రోజు అల్లరంతా మోహన్దే! కాని ఆ విషయం బయట పెట్టడు. పైగా తనకి వ్యతిరేకులైన వారినందర్నీ నేరస్తులుగా నిలబెడతాడు. అసలే అతడంటే పిల్లలకి భయం! ఎవడు నోరెత్తినా తంతాడని జంకు. స్కూల్లో అతనికి ప్రతిపక్ష నాయకుడు పేర్రాజు ఒక్కడే! మోహన్ మామయ్య కొడుకే పేర్రాజు. వాడి చెల్లెలే లక్ష్మి. వాళ్ళిద్దరికీ క్షణం పడదు.

అన్నకి పోటీ. చిన్నప్పట్నుంచీ అందరూ లక్ష్మిని మోహన్‌కి కాబోయే భార్య అనడంతో ఆఇద్దరికీ పొత్తుకుదిరింది. అలాగే పేచీలు కూడా...!

ఆ రోజు మోహన్ మహా కోపంగా వున్నాడు. అందరి భరతం పట్టాలనుకున్నాడు. ప్రార్థనయింది. "అందరూ హోమ్‌వర్క్ చేశార్రా?" అనడిగాడు టీచర్. చాలా తలలూగాయి. ఆ మధ్యలో వూగని తలలు కూడా కొన్ని వున్నాయని వూహించాడు టీచర్. "ఒరే మోహన్! నీ రిపోర్టు ముందు పట్టా. తర్వాత హోమ్ వర్క్ చూద్దాం" అన్నాడు. మోహన్ కాగితంతీసి అందించాడు. తీసుంటే జేబులోంచి బీడీ కిందపడింది. టీచర్ అది గమనించక పోవడంతో లక్ష్మి తీసి జాగ్రత్త చేసింది.

"మోహన్" అంటూ పిలిచాడు టీచర్.





ఆ అబ్బాయి లేచి వణుకుతూ, పలక చేత పట్టుకుని వచ్చి టీచర్ ఎదురుగా నిల బడ్డాడు.

"లెక్కలు హోంవర్క్ చేయమన్నాను. చేశావా?"

తలూపి పలక చేతికిచ్చాడు.అందులో చాలా తప్పులున్నాయి.

"ఏమిట్రా ఇవన్నీ?" కళ్లురిమి చూశాడు టీచర్. మోహన్ పలకలేదు. "ఇటురా!" పక్కకి పిలిచాడు. "చెయ్యి చాపు" అంటూనే ఈత బెత్తం మూడు సార్లు చేతిమీద పడింది. వాడు ఏడుపు మొదలెట్టాడు.

'ముయ్‌నోరు! దున్నపోతా! లెక్కలు చేయమంటే బొంగరాలు ఆడతావా?" అంటూ అరిచాడు.

తర్వాత "నాగన్నా!" అన్నాడు. అందరికంటే వెనుక కూర్చున్నాడు నాగన్న. అతని పక్కన వెంకటసుబ్బన్న కూర్చున్నాడు. నాగన్న లేచి, పలక తీసుకొని టీచర్ వద్దకు వచ్చాడు. "చేశావా?" అనడిగాడు టీచర్. నాగన్న తలూపి పలకందించేడు. లెక్కలు కరెక్టు గానే వున్నాయి.

"గోలీలాట ఆడావా లేదా?"

నోరెత్తలేదు నాగన్న.

నిజానికి అతడు ఆడనేలేదు. మోహన్ పది బీడీలు అప్పు ఇవ్వమంటే నిన్న ఇవ్వలేదు. దానికి ప్రతిఫలం ఈ రోజు దెబ్బలు!

రెండు చెవులూ పట్టుకు గుంజాడు టీచర్. నాగన్న పెడబొబ్బలు పెట్టాడు. "గుంజీలు తియ్‌రా" అంటే కిందా మీదా పడి యాభై గుంజీలు తీశాడు. ఏడుస్తూ నిలబడ్డాడు. "ఫో" అంటూ అరుస్తూనే వెళ్లి తన సీట్లో కూర్చున్నాడు.

"వెంకట సుబ్బన్నా" అని అరిచాడు టీచర్. వెంకటసుబ్బన్న లేచి అటు ఇటు చూశాడు. జారిపోతోన్న నిక్కర్‌ని పైకి ఎగలాగి, బయటకు పరుగుతీసు కొన్నాడు. శంకర్, బుచ్చి వెంటపడి పట్టుకొచ్చారు. సమాధానం ఆశించ కుండానే కొట్టి పారేశాడు టీచర్ నిక్కరును చల్లచల్లగా చేసుకొన్నాడు వెంకటసుబ్బన్న.

"లక్ష్మీ" అరిచాడు టీచర్.

లేచి వచ్చి నిల్చుంది. "హోం వర్క్ చేశావా?"

తల అడ్డంగా వూపింది. "చెమ్మ చెక్కలాడ్డం చేతనవునుగాని,హోంవర్క్ చాతకాదే! చెయ్యిచాపు"

మూడు దెబ్బలు తిని కళ్లు తుడుచు కొంటూ మోహన్ వైపు చూసింది. కోపంగా వెళ్లి కూర్చుంది.

"పేర్రాజు" అంటూ పిలిచాడు. లేచి ముందుకు వచ్చాడు.

"నిన్న ఫుట్‌బాల్ ఆడావుట కదా"

"అవున్సార్! నిజంగానే ఆడాను. కాని దెబ్బలు తిన్న వీళ్లలో చాలా మంది ఏ తప్పులూ చేయలేదు సార్. మోహన్ కావాలని వాళ్ల పేర్లిచ్చాడు. బుచ్చి, శంకర్, రమణ, మోహన్ వాళ్లంతా నిన్న బీడీలాట ఆడారండి! అయితే వాళ్లెవరి పేర్లూ మీకివ్వలేదు. వాళ్లంతా అతగాడి మనుషులట!?" అన్నాడు పేర్రాజు అరుస్తూ.

టీచర్ మండిపడ్డాడు—"దున్నపోతా! నీ విషయం చెప్పమంటే వాళ్లందరివీ నీకెందుకు? గాడిదా! వెళ్లికూర్చో" అన్నాడు. తర్వాత అందరివైపు చూస్తూ "శ్రద్ధగా చదవక ఆటలాడితే ఒకొక్కడి

తోలూ వలిచేస్తాను" అన్నాడు బెదిరింపుగా.

"పేర్రాజు గాణ్ని పాతేయాల్సింది టీచర్! ఎందుకూరుకొన్నాడో" అనుమానాన్ని వ్యక్తం చేశాడు బుచ్చి, మోహన్ ముందు.

"ఆ పని మనమే చేద్దాం! లేకపోతే ఎన్ని గుండెలా వాడికి నా మీద చెప్పడానికి" అన్నాడు మోహన్ కోపంగా.

ఇంటర్వెల్ అయింది. లక్ష్మిని దగ్గరగా పిలిచాడు మోహన్. చెయ్యి పట్టి చూశాడు. ఎర్రగా కంది వుంది.

"లంజకొడుకు! గట్టిగా కొట్టేశాడు" అన్నాడు.

"నువ్వే కావాలని కొట్టించావు. ఇంటికి పద! నీ భరతం వుందిలే" అంది.

"ఏయ్! పోనీకదా అని బాధపడితే రెచ్చిపోతున్నావ. సరే మళ్ళీ వారం చూద్దువుగాని - బాగా వుతికిస్తాను" అన్నాడు చెవిని మెలిపెడుతూ.

"నిన్నిపుడే ఉతికించేదాన్ని. అయినా బావవని వూరుకొన్నాను" అంటూ బీడీ



చూపించింది. మోహన్ గతుక్కుమన్నాడు. దాన్ని లాక్కొని జేబులో వేసుకొన్నాడు.

మర్నాడు-

స్కూలుకు వస్తూ వస్తూనే-

పేర్రాజుతో తగువు పెట్టుకొన్నాడు శంకర్. ఒకర్నొకరు తిట్టుకొంటూ బాదుకొన్నారు. వాళ్లిద్దర్నీ విడిపించడానికి మధ్యవర్తులుగా చేరినట్టే చేరి బుచ్చి, రమణ పేర్రాజును కొట్టేరు. చూస్తూ



మోహన్ నిలబడ్డాడు కాని, వెళ్లి విడిపించ లేదు.

టీచర్ రాగానే రిపోర్టు చేశాడు పేర్రాజు. అందర్నీ వరుసగా చావబాదేడు టీచర్. మోహన్‌ని మాత్రం ఏమీ అన్లేదు. బుద్ధిగా వెనుకన కూర్చుని ఏదో రాసు కొంటున్నాడు మోహన్.

"ఇటు రారా మోహన్" అన్నాడు.

"ఏరా ఎలావుంది వంట్లో? క్షేమ మేనా? నీ సంగతి నాకు తెలుసురా! అందుకే నిన్ను కనిపెట్టమని ఇంకొకణ్ని పురమాయించి వెళ్లాను. నిజం చెప్పు-బిడీలాటలాడుతున్నావు కదా" అన్నాడు టీచర్.

"అందరూ ఆడితే నేనూ కాసేపు ఆడాన్సార్! మరి నన్నేం చేయమంటారు" అన్నాడు తలెగరేసి.

"తంతాను వెధవా! జాగ్రత్త! ఏమిటా తలబిరుసు"

వూరుకొన్నాడు మోహన్. కాని, మనసులో 'నీ సంగతి నే చూస్తానుగా!' అనుకొని వెళ్లి సీట్లో కూర్చున్నాడు. లక్ష్మి దగ్గరగా వచ్చి "బావా!" అంది వుడికింపుగా.




మోహన్ పిల్లలందరిలోనూ రౌడీగా, గ్రూపు నాయకుడిగా పేరుతెచ్చుకొన్నాడు.

గ్రామంలోని పలుకుబడివల్ల అతగాడి అల్లరి రాణించింది. అయితే అయిదవ తరగతితోనే చదువు నిలిపివేయవలసి వచ్చింది. తల్లి చనిపోవడంతో, ఆర్థిక ఇబ్బందుల వల్లా చదువుపరంగా మోహన్ ఎదుగుదల కొడిగట్టిపోయింది. ఉన్న తొమ్మిదెకరాల పొలం పంటే ఆధారమైంది.

పొలానికి వెళ్లి పనిచేసే పెద్దదిక్కు ఇంట్లో ఎవరూలేరు. పొలంలో వేరుసెనగ వేశారు. కలుపుతీయాలి. కొడుకును పిలిచి జగన్నాథం "కాంతమ్మనుపిలుచుకురారా" అంటే హరిజన వాడకు బయలుదేరాడు.

అక్కడ వేపచెట్టు కింద అరుగుమీద గోపీ ఆడుకొంటున్నాడు. దగ్గరగా వెళ్లి "గోపీ! మీ అమ్మను పిలవరా" అన్నాడు మోహన్.

చెట్టుచుట్టూ తిరుగుతూ, ఎగురుతున్న గోపీ ఆ మాటలు వినికూడా విననట్లు తన ఆటల్లో మునిగిపోయాడు.

"ఒరేయ్ చెబుతుంటేనీక్కాదు! విన్పించడం లేదురా! మీ అమ్మ ఇంట్లోవుందా లేదా?" విసుగ్గా అడిగాడు.

"పిల్చుకోవోయ్! కన్పించట్లే ఆడుకొంటున్నాను" అన్నాడు గోపీ.

జుట్టుపట్టి గోపీ వీపుమీద గుద్దాడు మోహన్. "లమ్డీకే! చెప్తుంటే విన్పించదురా!" అంటూ కాల్తో తన్నాడు.

గోపీ మోహన్ ఈడువాడే! అయిదో తరగతి చదువుకొంటున్నాడు. దెబ్బలకి తట్టుకోలేక గట్టిగా అరిచాడు. ఆఅరుపులకి ఇంట్లోనుండి ఓ అమ్మాయి బయటికి వచ్చింది. అందంగా, నాగరికంగా వున్న ఆ అమ్మాయిని చూస్తూ నిలబడ్డాడు మోహన్.

"ఎందుకు కొట్టావు వాణ్ని?" అనడిగింది ఆమె కోపంగా.

"కొవ్వు బలిసింది వెధవకి! పిలిస్తే పకలలేదు"

"అబ్బో! పెద్దమగాడు బయల్దేరాడు! నిన్ను రెండు తంతే"

"ఏం? ఎలావుంది వొళ్లు" అన్నాడు దగ్గరగా వెళ్లి పిడికిలి బిగిస్తూ. ఆ జబర్దస్తీకి ప్రతిఫలంగా మోహన్ చెంపమీద చాచి కొట్టింది. కళ్లు తిరిగాయి దెబ్బకి. నీళ్లు కమ్ముకొచ్చాయి. ఏం చేయాలో తోచ లేదు. ఆవేశంగా ఇంటికి పరుగెత్తాడు. జరుగుతున్న గలభాకి ఇంట్లోనుండి కాంతమ్మ బయటి కొచ్చింది.

"ఏంటి?" అనడిగింది.

"ఎవడో కుర్రసన్నాసి! గోపీని తంతుంటే రెండిచ్చి పంపించాను" అంది.

"ఎవర్రా ఆ కుర్రాడు?" గోపీని నిలేసింది కాంతమ్మ.

"మరే...మన మోహన్" అన్నాడు ఏడుస్తూ.

కాంతమ్మ కూతుర్ని చివాట్లేసింది. 'అమ్మో... అమ్మో' అనుకుంటూ జగన్నాథం ఇంటికి దారితీసింది. మోహన్ మంచంలో పడుకొని వున్నాడు. జగన్నాథం మరో మంచంలో కూర్చుని కాంతమ్మను చూస్తూనే నవ్వుతూ—

"ఏంవోయ్! నీ ఇంట్లో ఆడపిల్లెవరే? వీణ్ని కొట్టిందట" అనడిగాడు.

"పెద్దమ్మాయి బాబూ! మోహన్ ఫలానా అని దానికి తెలీదు. తెలుసుంటే కొట్టేది కాదు. అయినా మోహన్ బాబు అల్లరి కూడా అలాగే వుంది" అంది కాంతమ్మ.

"అలాగేచూడు. దానికాళ్లు విరిచేస్తాను" మోహన్ కోపంగా అరుస్తున్నాడు.

"ఏడ్చావులేరా గాడిదా! నోరు మూసుకొని పడుకో" అని కాంతమ్మ వైపుతిరిగి—"కలుపుతీయించడానికి ఇంట్లో పెద్దదిక్కు ఎవరూ లేరు. ఈసారి ఈ బాధ్యత అంతా నీదే! నాకైతే పై పన్లున్నాయి" అన్నాడు.

కాంతమ్మ 'సరే' అన్నట్టుగా తలూపింది.

"రేపు కూలీల్ని పిలుస్తాను. ఎల్లుండి తీయిద్దాం" అంది.

"అమ్మాయి చదువైపోయిందా?" అని అడిగాడు జగన్నాథం కాంతమ్మ కళ్లల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ.

"అయిపోయింది బాబూ! వారం రోజులయింది ఇంటికొచ్చి. మోహన్ బాబును ఎప్పుడో చిన్నతనంలో చూసింది. లేకుంటే చెయ్యి చేసుకొనేది కాదు"

"రేపోసారి ఇంటికి పంపు"

తలూపి ఇంటికివెళ్ళింది కాంతమ్మ. సీత చదువుకొంటూదీపంముందుకూర్చొనుంది. పక్కన కూర్చొని గోపీ పద్యాలేవో బట్టీ పెడుతున్నాడు.

* * *

"ముందూ వెనకా చూసుకోవు. ఆ అబ్బాయిని ఎందుక్కొట్టేవు" అంది కాంతమ్మ ఇంటికి వస్తూనే.

"అదేంటమ్మా అలా అంటావు. గోపీని కొడుతుంటే చూస్తూ వూరుకోమంటావా?"

"ఇదేం టౌను కాదే! పల్లెటూరు. మోహన్ ఎవరబ్బాయి అనుకొంటున్నావు. జగన్నాథం బాబు కొడుకు. తెలుసా?" అంది.

"అయితే మీదపడి తన్నినా అడిగే అధికారం మనకు లేదన్నమాట"

"నీకేం చెప్పినా అర్థం కాదే" చేత్తో తల బాదుకొంది కాంతమ్మ.

"పిల్లలు వాళ్లువాళ్లూ కొట్టుకొంటారు.

అంది తిరిగి. సీత మౌనం వహించింది. పుస్తకం తిరగేస్తూ ఆలోచిస్తోంది. తక్కువ కులంలో పుడితే ఎదురించే శక్తి వుండదా? మాల పుట్టుక అయినంత మాత్రాన మర్యాదలూ, మన్ననలూ వుండవా?

"రేపోసారి ఇంటికి రమ్మన్నాడు జగన్నాథం బాబు. వెళ్ళిరా"

"ఎందుకూ? నేను వెళ్ళను"

"ఏన్నేం చేసేడులే. వెళ్లు" అంది



కాంతమ్మ.

పెద్దదానివి నువ్వు కలుగజేసుకోకూడదు"

సీత మాట్లాడలేదు.

"నేనూ వస్తానులే" అంది కాంతమ్మ.

మర్నాడు మధ్యాహ్నం జగన్నాథం ఇంటికి వచ్చారు. ఆపాటికి ఇంట్లో జగన్నాథం ఒక్కడే వున్నాడు.

"మోహన్‌బాబు ఎక్కడికి పోయాడు బాబూ" అనడిగింది కాంతమ్మ లోనికి వస్తూ.

"ఎవణ్నో తన్నడానికిపోయుంటాడు. మరోపని వాడికి లేదుగా!" అని సీతను చూస్తూ - "ఏం చదివింది" అనడిగాడు కాంతమ్మను.

"చెప్పవే"

"ఇంటర్ పూర్తయింది బాబూ!" అంది సీత నేలమీదే చూపులు సారిస్తూ.

"ఇంకా చదవాలని వుందా? చాలనుకొంటున్నావా?"

"చదవాలనే వుంది! అయితే అలాగే



అనుకొంటూ పూర్కొంటున్నాను" అంది తలెత్తి అతని వైపు చూసి. తిరిగి తల దించుకుంది.

"మావాణ్ని చూశావా?" అనడిగాడు.

తలూపింది సీత.

"వాడో గాడిదలా తయారవుతున్నాడు. స్కూలు మానేశాడు. ఇంట్లో చేసేదిలేక గాలిపట్టి పోతున్నాడు. వీలైతే రోజూ కొంచెంసేపు వాడికి నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్పరాదూ! నీవల్లనైనా వాడు కాస్త బాగుపడతాడేమో..."

అవునని తలూపలేదు సీత. ఆలోచిస్తూ నిలబడింది.

"అమ్మో! మోహన్ దీన్ని బతకనిస్తాడా బాబూ! ఇదంటే అతనికి అసలే వళ్లు మంటగా వుంది" అంది కాంతమ్మ నవ్వుతూ.

"ఎందుకు కొడతాడే నీ వెర్రిగాని! అయినా మచ్చిక చేసుకోవడంలో ఏదైనా వుంటుంది"

"నిజమే బాబూ!" అంది కాంతమ్మ కూతుర్ని పరిశీలిస్తూ.

మాట్లాడలేదు సీత. ఆవేశంగా మోహన్‌ని కొట్టగలిగిందే కాని, అతను తిరగబడితే తనేం చేయలేనని సీతకి తెలుసు.

రేపటిరోజు తిరగబడితే ఏం చెయ్యాలి? పైగా అతగాడింటికి వచ్చి ట్యూషన్ చెప్పాలి. ఇంట్లో ఎవరూ వుండరు. కొట్టినా, తిట్టినా పడి వుండాలి. అయినా తప్పదు. తల్లి ఆ ఇంటి అసరాతోనే కుటుంబాన్ని నెట్టుకొస్తోంది. కాదంటే జగన్నాథానికి కోపం రావచ్చు.

"అయితే రేపటి నుండి వస్తాను బాబూ" అంది తల పైకెత్తి.

"నీ ఇష్టం. నీ వల్లనైనా వాడు బాగుపడతాడేమోనని ఆశ" అన్నాడు తలుపు వైపు చూస్తూ. మోహన్ అప్పుడే ఇంట్లోకి వస్తున్నాడు. సీతని గుర్రుగా చూశాడు. "ఇదే నాన్నా! నన్ను కొట్టింది" అన్నాడు రోషంగా.

"నోరు ముయ్యవోయ్! నువ్వు మహ మంచివాడివి. అద్సరే-రేపట్నుండి నువ్వు ఈవిడ దగ్గరే ట్యూషన్ నేర్చుకో! బుద్ధిగా చదువు" అన్నాడు జగన్నాథం.

'ఇదా నాకు ట్యూషన్ చెప్పేది' అనుకొంటూ ఆశ్చర్యంగా సీతవైపు చూశాడు. వెంటనే తల తిప్పుకొన్నాడు.

"వెళ్తాను బాబూ! రేపటికి కూలీల్ని పురమాయించాలిగా" అంది కాంతమ్మ బయటికి వెళ్తూ. జగన్నాథం తలూపాడు. ఆమెతోపాటు సీత కూడా దారి తీసింది.

ఇంటికి వచ్చిన తర్వాత అంది కాంతమ్మ - "మనకి చెప్పలేని సాయం చేస్తున్నాడు జగన్నాథం బాబు. ఆయన సంతట ఆయనే అడిగితే. మనం కాదన కూడదు. రెండు మూడ్రోజులు అల వాటైతే మోహన్‌బాబు సర్దుకుపోతాడు. పిల్లాడు అల్లరి చేస్తే అంతగా పట్టించుకోకు"

'సరే'నని తలూపింది సీత.

సాయంత్రం నాగులు వచ్చాడు ఇంటికి. వస్తూనే "ఏం పీతా! బాగున్నావా" అన్నాడు వెటకారంగా మంచంలో కూర్చుని. సీత ఆ పలకరింపుకి ముఖం ముడుచుకొంది.

"పీత ఏమిటి? సీత అని పిలవలేవూ" అంది కోపంగా.

"ఓ సారీ... తప్పయింది! సరే-ఇంకా చదువుతావా" అన్నాడు వేళాకోళంగా.

"చదవాలనే వుంది. ఉద్యోగం




చూసుకొని పట్నం పోతే బాగున్ను! ఇక్కడీ బానిస బతుకులు బతకలేను."

"అయితే ప్రైవేటుగా చేసి ఆర్.యం.పి.కి కట్టు. నేనూ అదే చదవాలనుకొంటు న్నాను. ఇద్దరం డాక్టర్లయితే హాయిగా ఆస్పత్రి పెట్టుకోవచ్చు."

"నీ దారి నీది, నా దారి నాది. అయినా నువ్వు చదివేదే నేనెందుకు చదవాలి?"

"ముందు చూపు కోసం" అని నవ్వాడు – "అలా రారాదూ సన్నగా షికారెళ్లి వద్దాం."

"నీతోనా?! చచ్చినా రాను? రౌడీలతో నాకు తిరగటం సిగ్గుచేటు" అంది కసురు కొంటూ.

"సరే! ఈ సిగ్గులన్నీ రేపు మాపుల్లో పోవా" అంటూ నవ్వి బయటకు వెళ్లి పోయాడు.

సీత లేచి దీపం వెలిగించింది. సీత మేనత్త కొడుకు నాగులు. టౌన్లో ఇంటర్ పూర్తి చేసి ఆర్.యం.పి. కోసం ప్రయత్నాలు చేస్తున్నాడు. టౌన్లో వున్నప్పుడు సీతని పలకరించడానికి గర్ల్స్ హాస్టల్‌కి అప్పుడప్పుడూ వచ్చే వాడు. అయినా సీత పలకరింపుకి నోచుకోలేకపోయేవాడు. నాగులు టౌన్లో పెద్ద జులాయి అమ్మాయిల వేటగాడు. అతని గురించి చాలా కథలు వింది. అందుకనే దూరంగా వుంటోంది. అయితే పల్లెల్లో చిన్నప్పుడే పెళ్లి సంబం ధాలు ఏర్పడతాయి కాబట్టి సీతను, నాగులుకి ఇద్దామనుకొన్నారు పెద్దలు. ఇద్దరినీ భార్యాభర్తలంటారు. కూడా ఇవేవీ సీతకు సరిపడవు. నాగులు అంటే ఏహ్యం. అయినా నాగులు సీతని తన దాన్ని చేసుకోవాలనిఆరాటపడుతున్నాడు

ఉదయం పది గంటలకే కాంతమ్మ కూలీల్ని తీసుకొని కలుపు తీయించ డానికి వెళ్లిపోయింది. గోపి చెట్టు కింద ఆడుకొంటున్నాడు పిల్లలతో. సీత జగన్నాధం ఇంటికి ట్యూషన్ చెప్ప డానికి వెళ్లింది.

జగన్నాధం ఆసరికే బయటకు వెళ్ల బోతున్నాడు. మోహన్ కాలక్షేపంగా మంచంలో పడుకుని పైన వాసాలు లెక్కపెడుతున్నాడు.

సీతను చూసి– "రామ్మా"అన్నాడు జగన్నాధం. లోనికి వచ్చింది. సీతను చూసి లేచి కూర్చున్నాడు మోహన్.

"లే! లేచి నాలుగు ముక్కలు నేర్చుకో. చూడమ్మా! వాడేదైనా అల్లరి చేస్తే నాతో చెప్పు"అన్నాడు జగన్నాధం.

నవ్వుతూ తలూపింది సీత. మోహన్ లేచి, మూలన పారేసిన పలకా బలపం తీసుకొని బుద్ధిగా కూర్చున్నాడు. తృప్తిగానవ్వి వెళ్లిపోయాడు జగన్నాధం.

కొన్ని క్షణాలు ఇద్దరూ మాట్లాడుకో లేదు. తలెత్తి అతని ముఖంలోనికి చూసింది సీత.

"కోపం వచ్చిందా?" అనడిగింది లాలనగా.

తలెత్తి చూశాడు మోహన్. మళ్లీ దించుకున్నాడు.

"నువ్వు బుద్ధిగా వుంటే నేనెందుకు కొడతాను. అయినా అల్లరి చేయడం తప్పు కదూ!" అంది. జవాబుగా పలకతీసి ఆమె ముందుంచాడు. ఆంగ్లాక్షరాలు పలకమీదరాసి దిద్దమంది వాటిని.

సీతకి ఈపల్లె వాతావరణం నచ్చదు. పూసుపోవట్లేదు. పైగా కులపట్టింపులు! కలిసిమెలసి తిరగడానికి కులాలు, అంత రాలు అధికృత చూపడం భరించలేనిదిగా వుంది.

"ఏం చదివావు" అనడిగాడు మోహన్ తలెత్తి. చిరాకుగా వుంది అతనికి ట్యూషన్. పారిపోయి హాయిగా ఆడుకోవాలని వుంది. రాక్షసిలా అడ్డు పడిందని సీతమీద మంటగా వుంది. అయినా తప్పదు.

"ఇంటర్ అంటే తెలుసా?"

"ఓ! ఎందుకు తెలీదు" అన్నాడు అర్థం కాకపోయినా. సీత గలగల నవ్వింది. ఆ నవ్వు ఎంతో నచ్చింది మోహన్‌కి.

"ఏం తెలుసో చెప్పు చూద్దాం"

మోహన్ మాట్లాడలేదు.

"తెలియకపోతే అబద్ధాలాడకూడదు తెలుసన్నట్లు. మంచిది కాదు. ఎప్పుడైనా నిజం చెప్పాలి తెలుసా" అంది.

"నిజమే చెప్పాలా!" అన్నాడు ఆశ్చర్యంగా.



"అవును మరి నిజమే చెప్పాలి"

"అయితే చెప్పనా?"

"చెప్పు"

"నిన్ను తన్నాలని వుంది"

సీత హతాశురాలైంది. నిజం వినడం ఎంత ఘోరంగా వుంటుందో ననిపించింది.

"ఎందుకని?"

"నన్ను కొట్టావుగా"

"అయితే! కొడతావా" అంది విస్తుపోతూ. కొట్టినాకొడతాడని ఆమెకు భయం వేసింది. అల్లరి పిల్లాడని వింది. ఇంట్లో ఎవరూ లేరు. జాగ్రత్తగా వుండాలనుకొంది.

"మీ టీచర్ని కొట్టావా ఎప్పుడైనా



సూ్కల్లో?" ప్రశ్నించింది.

"అమ్మో! తిరిగి తంతాడు"

"కాదు! టీచర్ని కొట్టకూడదు. నేను కూడా, నీకు టీచర్నే కాబట్టి నన్నూ కొట్ట కూడదు తెల్సా" అంది నీతిని బోధిస్తూ.

"అయితే నిన్ను టీచరమ్మా అని పిలవాలా?"

"అఖ్ఖర్లేదు. నీ ఇష్టం వచ్చినట్టుగా పిలువు" అంది నవ్వుతూ.

" 'సీతా' అని పిలుస్తాను. బాగుంటుందా?"

"ఎందుకు బాగోదు" అంది అతని తల నిమురుతూ.

సీతని కొట్టాలన్న ఆలోచన మంచిది కాదన్పించిందెందుకోగానీ మోహన్‌కు.

మోహన్‌కి పధ్నాలుగేళ్లు పల్లెటూర్లో పెరగడం వల్ల అల్లరి అబ్బిందేకాని, సంస్కారం అబ్బలేదు. మనిషిని చూస్తే అంత చిన్న వయసని ఎవరూ అనుకోరు. ఇరవై ఏళ్ల వాడిలా బలంగా, ఎత్తుగా కన్పిస్తాడు. లేతవయసంటే ఎవరూ నమ్మరు. దిగుల్లేని వయసు కనుక ఆరోగ్యంగా, అందంగా వుంటాడు.

సీత వయసు పదహారుదాటి పదిహేడు నడుస్తోంది. మొదట నుండీ టౌనులోనే వుండడం వల్ల నాగరికత తెలిసివచ్చింది. పైగా అందరితో కలసి తిరగడం వల్ల సభ్యతా, సంస్కారాలు అలవడ్డాయి. అంత అందంగా లేకపోయినా సలాగ్గా, నాజుగ్గా వుంటుంది. తల్లి పోలిక.

కాంతమ్మ భర్త చనిపోయి రెండేళ్లయింది. భర్త పోయినతరువాత పిల్లల్ని చదివించుకొంటూ కాలం వెళ్లదీస్తూంది. ఆ పల్లెలో ఇంతో అంతో అందగత్తె కాంతమ్మ. మురికి చీరల్లో కూడా ఆకర్షణీయంగానే కన్పిస్తుంది. పిల్లల రూపు రేఖలు కూడాఅలాగే వచ్చాయి. ఆర్థికంగా జగన్నాథం మీద ఆధారపడడంతో అణిగి మణిగి వుంటుంది. పల్లెలో చాలా మందికి వారి వివరాలు తెలుసు; అయినా పట్టించుకోనట్టే వుంటారు.

సాయంత్రం వస్తానని చెప్పి వెళ్లిపోయింది సీత. వెళ్లిపోతూన్న సీతను చూస్తూ కూర్చున్నాడు మోహన్. సీత అందాన్ని గురించి అంచనావేసే వయసు కాదు మోహన్‌ది. ఆ భావాలు కూడా రేగడం లేదు. అయితే 'టీచరమ్మ' అన్న గౌరవ భావం మాత్రం అతన్లో ఏర్పడుతోంది.

సాయంత్రం సీత రాలేదు. మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకి వచ్చింది. మోహన్ అక్షరాల్ని దిద్దుతూ కూర్చున్నాడు. సీతను చూసి లేచాడు.

"నువ్వు చెప్పిన అక్షరాలన్నీ అప్పుడే వచ్చేశాయి" అన్నాడు జారిపోతున్న నిక్కర్ని మీదికి ఎగలాగుతూ. సీత నవ్వుతూ వచ్చి ఎదురుగా కూర్చొంది.

"అయితే రాయి చూద్దాం"

అయిదు నిముషాల్లో కష్టపడి రాసి చూపించాడు. సంతోషించింది. అంత తొందరగా నేర్చుకొంటాడనుకోలేదు. ఏదో బలవంతం తప్పితే ఆ కుర్రాడు శ్రద్ధగా నేర్చుకొంటాడని నమ్మకం ఆమెకు ఏ కోసనా లేదు. కాని అతడి పద్ధతి చూస్తే పట్టుదల గల వ్యక్తిగా కన్పిస్తున్నాడు. ఈ విధంగా అయితే తేలికగానే బాగుపడగలడని ఆశించింది.

"నిన్న సాయంత్రం మళ్లీ రాలేదేం" అనడిగాడు.

"ఇంట్లో నేనే వంట చేశాను, అమ్మ పొలంపన్లో వుంటే"

"ఓహో! సరే! తర్వాతేం రాయమం





హావో చెప్పు" అన్నాడు పలకందిస్తూ.

"రెండోరకం అక్షరాలురాయించనా?"

"రెండో రకం...." అన్నాడు కనుబొమ్మలు ఎగరేసి.

"అంటే ఇంగ్లీషులో నాలుగు రకాల అక్షరాలుంటాయి. నేర్చుకొంటే చాలా సులభం"

"ఛ ఛ!ఏం భాష? తెలుగే మేలు"

నవ్వుతోన్న అతన్ని చూసింది సీత. అందమైన లేత ముఖం! అందులో స్వచ్ఛమైన చిరునవ్వు. ఆసక్తిగా వుంది. మళ్లీ మళ్లీ చూడాలన్పిస్తూంది.

"ఏంటలా చూస్తున్నావు! నాముఖంలో కోతులాడుతున్నాయా" అనడిగాడు వెక్కిరిస్తూ.

"కోతులు కాదు, కొండముచ్చులు" అంది నవ్వుతూ. పలక తీసుకొని రెండో రకం అక్షరాలురాసి దిద్దమంది. అతడు అక్షరాలు దిద్దుతూంటే తను తెచ్చుకొన్న నవల్ని ఆసక్తిగా చదువుతూ కూర్చుంది. నవలలో అతి చిన్న వయసుగల హీరోను అతనికంటే పెద్ద వయసు గల హీరోయిన్ ప్రేమించి, అతని కోసం తపన పడి, చివరికి అతన్నందుకోలేక, వేరొకర్ని పెళ్లిచేసుకోడానికి మనసొప్పక ప్రేమ చరితార్థంగా నిలవాలని ఆశించి హీరోయిన్ ఆత్మహత్య చేసుకోవడం ఇతివృత్తం.

మోహన్‌ను చూసినగ్గర్నుంచి ఆ నవలెందుకో రెండోసారి చదవాలన్పించి చదువుతోంది. మొదటిసారి చదివినపుడు పెద్ద ఆసక్తికరంగా లేదు. కాని ఇపుడు ఉత్కంఠగా వుంది. మొదటి చూపులోనే ప్రేమ వెల్లివిరుస్తుందంటారు. దాన్ని ఇంతవరకూ నమ్మలేదు అనుభవంలో లేదు గనుక. అయినా మొదటి చూపులో ప్రేమ పుట్టటమేమిటి? నాన్సెన్స్. అది వాంఛ మాత్రమే! ప్రేమ అనేది ఎదుటి వ్యక్తి వ్యక్తిత్వాన్నీ, మనసునూ నిర్ణయించుకొన్న తర్వాత మాత్రమే జనిస్తుంది.

ఏడాదిగా గుండెల్లో ఏదో తపన! హాస్టల్లో వున్నప్పుడు నవలలు విపరీతంగా చదివేది. ప్రేమను గురించి ఆలోచించేది. తపన పడేది. తాపం రేగితే స్నేహితురాల్ని వాటేసుకొని చల్లార్చుకొనేది. మగవాళ్లని గురించి ఆలోచించడమే తప్పొ, ప్రేమంటే ఏమిటో తెలియని వయసు. వచ్చి పల్లెలో పడిందిప్పుడు. పల్లెలో ఎవరూ ఆకర్షణీయంగా కన్పించరు. కొంత నాగరికంగా తిరిగే నాగులు రౌడీ అన్న భావనలోనే వూహల్లోంచి కొట్టుకుపోయాడు. అతన్ని చూస్తేనే రోత!

ఈ రెండు రోజులుగా మోహన్ సన్నిహితంగా వచ్చాడు. మోహన్‌ని చూస్తుంటే నవలలోని హీరో గుర్తుకొస్తున్నాడు. అతనిముఖంలోకే గుచ్చిగుచ్చిచూస్తోంది. కాలం ఇలా గడిచి పోతే బాగున్ననుకొంటోంది. మోహన్‌వయసుపధ్నాలుగేళ్లు ఆ వయసులో అతడికి శారీరక వాంఛలుంటాయా? ఆమె వయసు పదిహేడేళ్లు. ఆ వయసుకే పిల్లను కన్న వాళ్లు ఈ దేశంలో కోట్ల సంఖ్యలో వున్నారు.

సీతలో సంచలనం రేగుతోంది. అది నేరంగాని, పాపంగాని ఏమీ కాదు. రాత్రి నుంచి మోహన్ గురించే ఆలోచిస్తోంది. ఆ వయసుకే అందంగా, ఆకర్షణీయంగా వుండటంతో తనని ఆకర్షిస్తున్నాడా అనుకొంది. అయితే తనలో రేగే జ్వాల దేనికి ప్రతిరూపం? ప్రేమకా? స్నేహ

నికా? ఏమో? ఆమెకేమీ అర్థం కావడం లేదు. మోహన్ తనవైపే చూస్తోన్న సీతను చూసి– "ఏంటలా చూస్తున్నావు! నాకు దిష్టి తగిలేను" అన్నాడు.

సీత నవ్వి తొడగిచ్చింది.

"టీచర్ చూస్తే దిష్టి తగలదు"

"అలాగేం! మా టీచర్ నన్నోమారు అలా చూస్తేనే నేను మూడ్రోజులు జ్వరపడ్డాను తెలుసా! దుమ్మలగొండి మొహం వాడూను"

"నేను అలా లేనుగా!"

"నువ్వు అందంగా వుంటావు చందమామ పుస్తకంలోని రాణీగార్లా వుంటావు" అన్నాడు సీత కాలిమీద వేలితో రాస్తూ.

బరువుగా వూపిరి పీల్చింది సీత.

"దిద్దుకో అక్షరాలు" అంది.






"ఏమిటి ఆ గుంటడికి ట్యూషన్ చెప్తున్నావట! జాగ్రత్త సుమా లేకపోతే నీకే వాడు ట్యూషన్ చెప్పేస్తాడు" అన్నాడు నాగులు వస్తూవస్తూనే.

"ఆ విషయం నాకూ తెలుసు! అందుకే వెళ్తున్నాను" అంది సీత కోపంగా.

"వాడేం నేర్పుతాడు"

"ఫైటింగ్! ఫైటింగ్ బాగా చేస్తాడు! అదే నేర్చుకుందామని"

"గుడ్! బాగా నేర్చుకో. పనికొస్తుంది"

"అవును నీలాంటి వాళ్లని తన్నడానికి బాగానే పనికొస్తుంది"

"వహ్వా! ఆడదానిచేత, అందులోనూ నీ చేత తన్నులు తినడం అంటే ఎంత హాయి" అన్నాడు పరవశంగా నవ్వుతూ నాగులు.

"సిగ్గులేదూ!" చీదరించుకుంది సీత.

"ఎందుకు? కాబోయే మొగుడూ పెళ్లాల హాస్యాలకి సిగ్గెందుకు పడాలి?"

"ఛీ ఛీ! నువ్వా నా మొగుడివి! వెధవ కూతలు కూయకు! మళ్లీ మాట్లాడితే తంతాను" అంది కోపంగా ముక్కుపుటాలెగరేసి.

"ఏమిటి జోరుగా వున్నావ్! నాతో తమాషా చేస్తున్నావా? నా సంగతి నీకు తెలీదు. తిక్కరేగిందంటే నిన్నెంత సేపు నాశనం చేయడం! ఓన్లీ వన్ మినిట్! ఒకే ఒక నిమిషం చాలు" అంటూ సీత జడపట్టుకు ముందుకు లాగాడు. తూలి నాగులు మీద పడింది. గట్టిగా హత్తుకున్నాడు. గింజుకుంటూ అతని చేతిని కొరికింది. బాధగా పట్టు వదిలేశాడు.

"నా సంగతి తెలిసిందా! నా పేరే నాగులు! నీ అంతు చూసేదాకా నిద్ర పోను" అన్నాడు కోపంగా వెళ్తూ.

భయపడింది సీత. 'నిజమే. వాడన్నంత పనీ చేయగలడు. పగలెవరూ ఇంట్లో వుండరు. అదునుచూసి రావచ్చు. ఏం చేసినా దిక్కేమిటి?' అనుకొంది. వాడితో మర్యాదగా ప్రవర్తించడం మంచిదనుకుంది.

మర్నాడు మోహన్‌తో కలసి పొలానికి వెళ్లింది సీత. వస్తూన్న ఇద్దర్నీ చూసింది కాంతమ్మ. పొలంలో కలుపు తీయిస్తూ కుప్పలు పేర్పిస్తున్నది. ఇరవై మంది దాకా కూలీలు వున్నారు. జానపద గీతాన్నేదో వల్లెవేస్తున్నారు. ఎటు చూసినా పచ్చపచ్చని పొలాలు... వాటిని కాపలాకాసే చిన్న పిల్లలూ– చూడ చక్కగా వుంది వాతావరణం. వేరుసెనగ మొక్క నొకదాన్ని పెరికాడు మోహన్. ఆమె దగ్గరగా వచ్చి కూర్చుని ఆ పంట గురించి వివరంగా చెప్పాడు. 'ఈ పిల్లాడికి ఇవన్నీ ఎలా తెలుసు' అనుకుంది ఆశ్చర్యంగా. తర్వాత అదేమాట అడిగింది.

"ఇవన్నీ నీకెలా తెలుసు?"

"తెలియకపోతే రైతుబిడ్డనెలా అవుతాను"

"ఊహుఁ" అంది నవ్వుతూ. కాంతమ్మ ఇద్దరి దగ్గరగా వచ్చి "ఎందు

కొచ్చారు బాబూ!" అనడిగింది.

"మోహన్ వెళ్దాం రమ్మంటే రాక తప్పింది కాదు" అన్నది సీత.

"లక్షణంగా అమ్మాయిని పన్లో పెట్ట వలసింది" అందో కలుపు తీస్తున్నావిడ సీతను చూస్తూ.

"ఎలా పన్లోకొస్తుంది వదినా! పని తెలుసేగా! అయినా ఈ బానిస బతుకు దానికెందుకు. బుద్ధిగా చదువుకొంటోంది. దాన్నయినా పైకి రానీ" అంది కాంతమ్మ.

"ఎంత చదివితే మాత్రం ఏ లాభం? రేపు పెళ్లి చేయాలంటే అంతకన్నా ఎక్కువ చదువుకున్నవాడికి ఎక్కువ కట్నంతోనే పిల్లని కట్టబెట్టాలి. చూస్తూ చూస్తూ అలగావాడికి ఇచ్చుకోలేంకదా!"

"దాని నుదుట ఎలారాసుందో ఎవరికి తెలుసు! అయినా దాన్ని డాక్టర్ని చేయాలని వుంది" అంది కాంతమ్మ గర్వంగా.

మోహన్ అడిగాడు సీతని– "నువ్వు డాక్టర్‌వి అవుతావా?"

నవ్వింది ఆ మాటకి. "ఏం, ఎందుకు కాకూడదు? నీకేమైనా నష్టమా?" అంది.

"నాకెందుకు నష్టం? భలే ఇష్టం. పైగా నాకు జ్వరం వస్తే మాత్రలు, గోలీలు వూరకనే ఇవ్వాలి తెలుసా" అన్నాడు అర్థింపుగా. ఆప్యాయంగా తలమీద మొట్టింది సీత. తర్వాత "అలాఎందుకు? నువ్వుకూడా నాతో చదివి డాక్టరివి కావచ్చుగా" అంది.

"నాకొద్దు! నేను హాయిగా మేడిపట్టి దున్నుకొంటాను" అన్నాడు పొలం వైపు చూస్తూ. మోహన్ మాటలకి నవ్వుకొంది సీత.

ఇంటికొచ్చేసరికి వేపచెట్టుకింద పవళింపు సేవలో వున్న నాగుల్ని చూసి గతుక్కుమంది సీత. పిల్లలు కొంచెం దూరంగా గోలీలు ఆడుకుంటున్నారు. వెళ్లి ఇంటి తలుపు తీసింది. ఆ చప్పుడికి నాగులుకి తెలివొచ్చింది. లేచి చూశాడు. మంచి వయసులో పిటపిటలాడుతోంది సీత! పెద్ద అందగత్తె కాకపోయినా, అవయవాలన్నీ పొందిగ్గా వుండటంతో మత్తెక్కిస్తోంది. మెల్లిగా లోబరుచుకోవాలనుకున్నాడు. ఏదో పల్లెలో వున్న నాల్నాళ్లూ కాలక్షేపం. ఇంకో ఆడది కంటి చూపుకి ఆనడంలేదు సీతను చూసిన తర్వాత. లొంగదీయాలి. లొంగకపోతే దౌర్జన్యంగానైనా ఆక్రమించుకోవాలి. తర్వాత రుచి మరిగిన కుక్క...

ఆలోచనల్ని కట్టిపెట్టి ఇంట్లోకి అడుగువేశాడు నాగులు. చప్పుడుకి వెనుతిరిగి చూసింది సీత. నాగులు ఇంటి తలుపులు మూస్తున్నాడు. ఆత్రంగా ఉన్నాడు. తప్పకుండా అతడెప్పుడో ఇలాగే చేస్తాడని వూహించనే వూహించింది.కాని, ఇంత తొందర పడతాడని అనుకోలేదు. బతిమాలినా విన్పించుకోడనుకుంది. ఎదిరించాల్సిందే!

"తలుపులు ఎందుకు మూస్తున్నావు? మర్యాదగా తెరువు" అంది కళ్ళెగరేసి తీక్షణంగా చూసి.

"తలుపులు వెయ్యకపోతే తలపులు సిగ్గుపడతాయే!"అన్నాడు దగ్గరగా వచ్చి కవిత్వం ఏదో వెలగబెట్టినట్టు నవ్వుతూ.

"నాగూ! నాతో మర్యాదగా ప్రవర్తించు.లేకపోతే అల్లరిపట్టిపోతావ్!" బెదిరించింది.

నాగులుకి ఇదేమీ కొత్త అనుభవంకాదు. ఏ ఆడదాన్ని ఎలా లొంగదీయాలో అతగాడికి బాగా తెలుసు. నవ్వి, దగ్గరగా వచ్చి సీతని వాటేసుకొన్నాడు. విదిలించి




కొట్టి, ముఖం రక్కింది.

"కాదనకు. బాగుపడవ్. అయినా నిన్ను నేను పెళ్ళి చేసుకొంటానుగా! రా! హాయిగా కాలం గడుపుదాం" అన్నాడు మళ్ళీ సీతని చుట్టుకొంటూ. వాడి చేతి నుండి బయట పడటం అసాధ్య మన్పించింది. వుడుం పట్టు పట్టాడు. ఏడ్చినా, మొత్తుకొన్నా అతడు ఆశించింది కోరకుండా విడువడని తెలుసు! జాకెట్ చింపి పారేశాడు. పమిట లాగేశాడు. దాదాపు అర్ధనగ్నం చేశాడు. తమాయించు కొంటూ అతడి చేతిని గట్టిగా కరిచింది. పళ్ళు నాటుకుపోయి రక్తం వస్తోంది. బాధగా వెనుకడుగు వేశాడు నాగులు.

సీత బయటపడి మళ్ళీ వాడు వెంట పడకుండా తలుపు గొళ్ళెం వేసి పరు గెత్తింది. కొద్ది దూరంలోనే మోహన్ ఇల్లు. ఆవేశంతో శరీరం కాలిపోతోంది. భయంతో వణికిపోతోంది. పరుగుతోనే ఇంట్లోకి జొరబడింది.

మోహన్ పడుకొని వున్నాడు. ఇంట్లో మరెవరూ లేరు. వెళ్ళి అతని మీద పడి వాటేసుకొని ఏడ్చింది. ఈ హఠాత్సం ఘటన ఏమిటో అర్థం కాలేదు మోహన్‌కి. కాసేపు తత్తరపడ్డాడు. అరగంట ముందే నవ్వుతూ ఇంటికి వెళ్ళింది. ఏం జరిగిందక్కడ? ఏమిటిది? అతడికి వూపి రాడలేదు. ఆమె కన్నీళ్ళు అతడి బుగ్గల మీదుగా పడి ఇంకిపోతున్నాయి. గట్టిగా కౌగలించుకొని ఏడుస్తూ అతని మీద పడుకొంది. దిక్కుతోచక కౌగిలిని సడలించ చూశాడు మోహన్.

"ఏం జరిగింది?" అనడిగాడు ఆశ్చ ర్యంగా. ఏడుస్తూనే వివరాలు చెప్పింది. కోపంగా పళ్ళు నూరాడు మోహన్.

"వాడి గొంతు పిసికి చంపేస్తాను" అన్నాడు ఆవేశంగా. వెంటనే పరుగందు కొన్నాడు. వెంటపడి ఆపింది సీత. గట్టిగా హత్తుకొంది 'ఎక్కడ చేజారి పోతాడో' అన్నట్లుగా. ఆ ఆవేశంలో అన్నంత పనీ చేస్తాడని భయపడింది.

మంచంలో కూర్చోమంది. ఆవేశం చల్లారింది. అప్పుడు గమనించింది తన శరీరంపై ఆచ్ఛాదన లేదని. మోహన్ తన వొంపుల్ని తదేకంగా చూస్తున్నాడు. ఆశ్చర్యంగా అతడివైపు చూసింది. తల దించుకొని అతని పక్కగా చేరింది.

అతన్లో కోరికలు రేగుతున్నాయా? యవ్వనంలోని ఆడది కన్పిస్తే మగవాడికి తన వయసుతో సంబంధం వుండదా? వస్తూనే తప్పుచేసింది. అతనిమీద పడి కౌగలించుకొంది. ఆ వేడే అతనిలో అలజడి రేపుతోందా?

నిజానికి అతన్లో ఆ ఆలోచనలు ఇప్పుడిప్పుడే రేగుతున్నాయి. ఇంతవరకూ ఆకతాయితనం తప్పా మరో ధ్యాస లేదు. స్త్రీ సుఖం అంటే ఏమిటో తెలీదు. అయితే అర్ధనగ్నంగా వున్న సీతని చూస్తుంటే వింతగా వుంది కాని, అనుభ వించాలన్న వూహ రావటంలేదు. అందాన్ని ఆస్వాదిస్తున్నాడే గానీ మరో దురుద్దేశం లేదు.

తక్కువ కులందాని తల పెద్ద కులాల వాకిటే నిలబడాలి. అటువంటిది కాంతమ్మ జగన్నాథం ప్రాపకంతో ఆ ఇంట్లోనే తల దాచుకుంది. అయినా హద్దులున్నాయి. ఈ రెండ్రోజులచనువుతో, ఈ ఆదుర్దాలో గదిలో జొరబడింది తాను. తనకి రక్షణ కావాలి. అన్న ఆలో చనే ఆమెను అక్కడికి రప్పించింది.

"ఇంట్లో తువ్వాలుందా?" అంది అతన్ని క్రీగంట పరీక్షిస్తూ. తలూపాడు

వుందన్నట్లుగా.

"తెచ్చివ్వు" అంది. అందించిన తువ్వాలును పైటలా వేసుకొంది. సరిపో వట్లేదది.

"ఏం జరిగింది?" అనడిగాడు మళ్లీ మోహన్ ఆమె దగ్గరగా కూర్చుని. అలా దగ్గరగా కూర్చుంటే వెచ్చగా, హాయిగా వుంది. అందుకని మరింత దగ్గరగ వచ్చాడు. అతన్ని వారించటంలేదు సీత. అతని ముఖంలోకి తేరిపార చూస్తోంది.

"మోహన్! నాకో సాయం చెయ్యవూ?" అనడిగింది బతిమాలుతున్నట్లుగా.

"చెప్పు! ఏం చెయ్యమంటావు?" అనడిగాడు ఉత్సాహంగా.

"మా ఇంట్లో నా పైట పడుంది. అది తెచ్చిపెట్టవూ? నీకు ఆజన్మాంతం కృతజ్ఞతగా వుంటాను" అంది.

పాఠ్య పుస్తకంలో సీత, రాముడితో అన్న 'ఆజన్మాంతం కృతజ్ఞతగా వుంటాను' అనే మాటలు గుర్తుకొచ్చాయి మోహన్‌కి. లేచి కాంతమ్మ ఇంటికి వెళ్లాడు. ఎవరూ లేరు. కిందపడ్డ పమిట గుడ్డ లాక్కొని ఇంటికి వచ్చి సీతకందించాడు. గుండెనిండా కప్పుకొని సీత అతనికెదురుగా కూర్చుంది. మోహన్ ఆమెనే తదేకంగా చూస్తున్నాడు.

తననే తేరిపార చూస్తున్నాడని తెలిసి "అలా ఆడపిల్లల వైపు చూడకూడదు తెలుసా!" అంది సీత నవ్వుతూ.

"చూస్తే ఏం? ఇంతకీ ఆ నాగులుగాడు నిన్నేం చేశాడు" గద్దించినట్టు అడిగాడు

ఏం చెప్తుంది? బాధని తోటివారితో పంచుకోడానికి సిగ్గులేదుకాని, అసలు విషయం చెప్తే అవతలి వ్యక్తి ఆలోచనలు



ఎలా వుంటాయన్నది ఆలోచిస్తున్నది. అతనిలో ఆవేశం రేపితే? అవి విపరీతంగా పరిణమించవచ్చు. తానై అతన్ని నాశనం చేయడం సబబుకాదు. అయినా అతన్లో ఆ ఆలోచనలు లేవని నమ్మిక ఏమిటి? వయసు చిన్నదే అయినా మనిషిలో ఆ భావనలున్నట్టుగానే కన్పిస్తున్నాడు. తెలిసి నటిస్తున్నాడేమోనని కూడా అనుకొంది.

"చెప్పవూ!" అన్నాడు రెట్టిస్తూ. ఆమెకు దగ్గరగా జరిగాడు. ఆమె శరీరాన్ని తాకుతూంటే అతనికేదో అవ్యక్తం కాని ఆనందం కలుగుతున్నది. అందుకని ఆరాటపడుతున్నాడు. అయినా ఏమంటుందోనని భయం!

"ఏం చెప్పమంటావు?"

"ఏం జరిగింది?"

"ఏం జరగలేదు. నన్ను పెళ్లి చేసుకుంటాడట" అంది అతన్ని నఖశిఖ పర్యంతం పరీక్షిస్తూ.

"ఇంకేం! చేసుకోమరి. సీత రాముణ్ని చేసుకొందిగా" అన్నాడు నవ్వి.

"వాడు రాముడు కాదు రావణుడు"

"రావణాసురుడా? అయితే వద్దు. వాణ్ని చంపేయాలి. నేను రాముణ్నై చంపేయనా?"

అతని కళ్లల్లోకి చూసింది. నిర్మలంగావున్నాయవి. ఎలాంటి దురుద్దేశాలూ ఆ కళ్లల్లో కన్పించటం లేదు. బుగ్గలు ఎన్నగా మెరుస్తున్నాయి.

సీత అప్రయత్నంగానేఅతణ్నివాటేసుకొంది. దగ్గరగా లాక్కొని బుగ్గలమీద ముద్దాడింది "నిజంగా నువ్వు రాముడివి అవుతావా" అంది.

"ఓ! ఎందుక్కాను. నిన్ను పెళ్లిచేసుకొని నేను రాముణ్నవుతాను. వాణ్ని ఆ ఆ రావణాసురుణ్ని చంపేస్తాను" అన్నాడు.

సీత బదులు చెప్పలేదు. 'తనకంటే మూడేళ్లు చిన్న లోకజ్ఞానం అస్సలు తెలిని వాడు. అయినా 'పెళ్లి' గురించి మాట్లాడుతున్నాడు. తెలిసీ తెలియని సంఘర్షణల్లో వున్నాడు. తనే అతన్ని రెచ్చగొడుతూంది. అతను ఆరాటపడుతున్నాడు. ఆ ఆరాటాన్ని ఎందుకు కాదనాలి? తనకి అతని తోడుంటే చాలు! ఇంతకన్నా మంచి మనిషి భవిష్యత్తులో దొరుకుతాడనే నమ్మకం లేదు. అందుకని అతన్ని ఆసరా చేసుకోవడంలో తప్పులేదు. అమాయకంగా చెప్పినట్టు వింటాడు. చదువు పేరుతో రోజూ కలుసుకోవచ్చు. ఇద్దరికిద్దరూ కాలాన్ని మర్చిపోవచ్చు. ఎవడి కబంధ హస్తాల్లోనో కాకుండా తను కోరుకున్న వాడి చేతుల్లో నలిగిపోవడం స్వర్గసుఖం లాంటిది' అనుకొంది.

ఆలోచనలు పరిపరి విధాలుగా వున్నాయి. ఒకవేళ ఈ రహస్యం బయటపడితే?! మోహన్ అంత తెలివితక్కువ వాడు కాదు. మోసం చేయడనుకొంది. లొంగి రాడన్న భయం ఏ కొసనాలేదు. తనకు శరీర సుఖమే ముఖ్యమా? లేదు! తను అతన్ని ప్రేమిస్తోంది. అలాంటప్పుడు అతన్ని కావాలనుకోవడంలో తప్పేముంది?

"ఏం మాట్లాడవు?" తన మాటకి బదులు లేకపోవడంతో తిరిగి ప్రశ్నించాడు. సీత నవ్వింది—తెల్లని పలువరుస కన్పించేటట్లుగా.

"నన్ను ఎలా పెళ్లి చేసుకొంటావు? నేను తక్కువకులందాన్ని కదా!"

"కులం తక్కువైతే పెళ్లి చేసుకోరా? అన్నీ అబద్ధాలే! నేను నీకు తాళి కట్టే





స్తాను. ఎవడు అడు వస్తాడో చూస్తాను" అని పౌరుషంగా లేచాడు. అతని గుండెల్లో ఆందోళనగా వుంది. సీతని హత్తుకు పోవాలని వుంచి.

"ఇంటికి వెళ్లకేం! ఇక్కడే పడుకో ఆ రావణాసురుడు ఇంకా అక్కడే కాచుకొని వుంటాడు నీకోసం" అన్నాడు. సరేనంది తలూపి. ఇద్దరూ దూరదూరంగా పడుకొన్నారు-దగ్గర కావాలని తపనలు రేగుతున్నా.

* * *

జగన్నాధం ఇంటికి వచ్చేసరికి ఇద్దరూ నిద్రపోతూ కన్పించారు. కొడుకును లేపి "ఈ అమ్మాయి ఇంటికి పోలేదా?" అనడిగాడు. ఆ మాటలకి సీతకి మెలకువ వచ్చింది.

"ఏమమ్మా! ఇంటికి పోలేదేం?"

"అక్కడ నాగులున్నాట్ట! వాడు సీతని పెళ్లాడతానని అల్లరి చేశాట్ట" అన్నాడు మోహన్. అర్థం గాక జగన్నాధం సీతని ఆశ్చర్యంగా చూశాడు. ఏడుస్తూ వివరాలు చెప్పింది సీత.

"సరే! వాడి సంగతి నేను చూసుకుంటాలే. నీకంతగా పగటిపూట ఇంట్లో ఒక్కదానివీ వుండలేకపోతే ఇక్కడే వచ్చివుండు. వీడెలానూ ఇంట్లోనే వుంటాడుగా" అన్నాడు అభయమిస్తూ. సరేనంది.

సాయంత్రం కాంతమ్మకి ఈ వివరాలు తెలిసి మండిపడింది. వెంటనే నాగులు ఇంటికి వెళ్ళింది. అప్పటికే నాగులు వూరునుండి వుడాయించాడు. నోటికి వచ్చినట్లు నాగులు తల్లినీ, తండ్రినీ తిట్టి ఇంటికి వచ్చింది. సీతను చుట్టుకొని ఏడ్చింది. మరొకందుకు సంతోషించింది. చెడనందుకు.

"జగన్నాధంబాబు చెప్పినట్టే చెయ్యి! నేనూ,గోపీ కూడా రేపట్నుండి పొలానికి పోతాం కాబట్టి నువ్వు ఆ ఇంటనే వుండు. మోహన్‌బాబు తోడుంటాడు" అంది. సీత కాదనలేదు.

రాత్రంతా నిద్రలేదు సీతకి. మోహన్ ఆమెపై బలమైన ముద్ర వేశాడు. మోహన్ని, తనని రకరకాలుగా వూహించుకొంటూ కలతనిద్ర పోయింది. అతడు తనకి చేరువవుతాడా అన్న సంశయం. అంతకు ముందు లేని ఆవేదన అతగాడికి దగ్గర అవుతున్నకొద్దీ చెలరేగుతోంది. తమది శాశ్వత బంధం కావాలని తను కోరుతూంది. అది సాధ్యమా ? ఎదిగీ ఎదగని మనసునీ, మనిషినీ ఆశించటం హాస్యాస్పదంగా లేదూ ? లేదనుకొంది మళ్లీ. అనుకోని సంఘటనల కలయికే జీవితమన్పించింది.

ఉదయం సీత కళ్లు ఎర్రగా నిద్ర లేమితో వుండటం చూసి బాధపడింది కాంతమ్మ.

"ఏందుకే బాధపడతావు. జరిగిందేదో జరిగిపోయింది. మర్చిపో" అంది. ఆ మాటలకి నవ్వుకొంది సీత. కాసేపటికి తల్లీ, కూతురు, కొడుకు ముగ్గురూ కలసి జగన్నాధం ఇంటికొచ్చారు. మోహన్ అక్షరాల్ని దిద్దుతూ ఆలోచిస్తున్నాడు.

"బాగా చదువుతున్నట్టున్నాడే బాబు" అంది కాంతమ్మ మోహన్‌ని పలకరిస్తూ. ఇంట్లో జగన్నాధం లేడని తెలుసుకొంది.

"సీత నీకు తోడుగా వుంటుంది! వుంచనా?" అంది.

సరేనని, సీతని చూసి నవ్వాడు. కాంతమ్మ, గోపీ పన్లోకి వెళ్లిపోయారు.

"అక్షరాలు వస్తున్నాయా" అనడిగింది సీత.

"ఛ! రాపట్లేదు. కోతి బక్కూర్లలా ఏమిటీ అక్షరాలు! నాకేం నచ్చలేదీ భాష"

"ఎందుకని?"

"చెప్పానుగా! అయినా నువ్వుదగ్గరగా వుంటే చదవాలని వుండదు" అన్నాడు పలక కింద పడేసి. మోకాళ్ళ చుట్టూ చేతులు బిగించి ఆమెవైపే చూస్తూ కూర్చున్నాడు.

"ఛీ! అలా చూడకూడదు" అంది కవ్వింపుగా.

"ఎందుకు చూడకూడదు!"

"చూడ కూడదంతే! చదువుకో ముందు"

"ఊహుఁ! నాకు చదవాలన్పించటం లేదు" అన్నాడు. అంటూనే విసురుగా లోనికి వెళ్లిపోయాడు. వస్తూ...

"సీతా కళ్లు మూసుకో!" అన్నాడు నవ్వుతూ.

"ఎందుకని?"

"మూసుకో ముందు"

"చెప్పాలిగా"

"చెప్పను. కళ్లు మూసుకొంటావా లేదా?" బెదిరించాడు. తప్పిందికాదు సీతకి కళ్లు మూసుకొంది.

"ఇదిగో దొంగ చూపులు చూడ కూడదు" అన్నాడు. తలూపింది.

మోహన్ చేతులు సీత మెడచుట్టూ పడడంతో ఆమెకు గిలిగింతలు పెట్టినట్లయింది.

"చూడు" అన్నాడు నవ్వుతూ. కళ్లు తెరిచింది. మెళ్లో తాడు లాంటిదేదో వేలాడుతూండడం గమనించి చేత్తోతీసి చూసింది. నిర్ఘాంతపోయింది. నిశ్చేష్టగా అతన్ని చూసింది. మోహన్ నవ్వుతున్నాడు తాళి బొట్టు వంక చూస్తూ. నిన్న అన్న మాట ఈ రోజు చేసి చూపించాడు. సరదాగా అను కొన్న మాటల పర్యవసానం ఇలా తయారైందా? ఆమె కళ్లల్లో నీళ్లూరుతున్నాయి. కట్టిన తాడు తీసిపారేయాలా, వద్దా? దాని విలువెంత? క్షుద్రచేష్టలని తీసి పారేయగలదా? పద్నాలుగేళ్ల వయసులో చేసేది చిలిపి పనికాదు. ఈ నాటి సంఘటనలు జీవితాంతం జ్ఞాపకం వుంటాయి. మరచిపోవడం జరగదు. రేపు ఏవిధంగా తను ప్రవర్తించాలి? అతనే విధంగా తనని భావిస్తాడు? అసహ్యంగా, జుగుప్సగా అతనేమీ ప్రవర్తించలేదు. కావాలనే చేశాడు. సీతకు రక్షణ కావాలి. రావణాసురుణ్ని చంపాలి. రాముడు సీతను పెళ్లిచేసుకోవాలి! రాముడు తనే కావాలనుకున్నాడేమో! అందుకే సీతకి తాళి కట్టేశాడు.

సీత ఏడుస్తోంది.

"ఎందుకేడుస్తున్నావు! నేను తప్పు చేశానా?" సీత కన్నీళ్లు తుడుస్తూ అడిగాడు మోహన్.

"తప్పుకాదు! ఆడపిల్ల మెళ్లో తాళి కడితే పెళ్లిచేసుకొన్నట్లు లెక్క"

"అవును! నేను నిన్ను పెళ్లి చేసుకున్నాను. నువ్వు నా పెళ్లానివి" అన్నాడు. అతని ముఖంలో అమాయకత్వం కన్పిస్తోంది. 'నిజంగానే నీ భార్యనయితే నాదే అదృష్టం' అనుకొంది.

"ఇది మీ నాన్నకి తెలిస్తే ఎంత మండి పడతాడో తెలుసా?"

"ఎందుకు మండిపడతాడు? పెళ్లి చేసుకుంటే తప్పేమిటి? నన్ను తిట్టినా పడతాను. నిన్ను తిడితే భరించలేను"

సీత అతన్ని గాఢంగా కౌగిలించుకొంది.

"ఏం భయం లేదు—నీకు నేను తోడు" అన్నాడు ధైర్యంగా. కళ్లు తుడుచుకొని నవ్వింది.




"అలా నవ్వుతూ వుండాలి. పెళ్లా లెప్పుడూ ఏడవకూడదు తెలుసా"

ఆ మాటలకి పొంగిపోయింది.

"ఈ విషయం మీ నాన్నకి చెప్పకు" అంది.

"నాన్నకే కాదు, ఎవరికీ చెప్పను"

"ఈ తాళిబొట్టు ఎక్కడిది?"

''మా అమ్మది! అమ్మ చనిపోయిందిగా. ఇది బీరువాలో వుంది. రాత్రి నీ కోసం తీసి దాచి వుంచాను"

కనీసం తులం బంగారం విలువ! తులం వెయ్యిరూపాయలు. వెయ్యి రూపాయల వస్తువు కన్పించలేదంటే జగన్నాథం బాబు ఆత్రం పడడూ? కొడుకు తీశాడని తెలిసి ఏదని గద్దిస్తే ఇతనేం చేస్తాడు? తెంచి పట్టుకు పోతాడా? తాళిబొట్టు తెంచడం అపశకునం. తాళి తెగకూడదు. తాళికట్టినవ్యక్తి కలకాలం కలకలలాడుతూ వుండాలి. స్త్రీ కోరుకునేది అదే! అయితే ఇపుడేం చెయ్యాలి?

"పసుపు కొమ్ములున్నాయా" అంది సాలోచనగా. తను ఒకరి ఇల్లాలినన్న భావం ఆమెలో తిష్ట వేసుకొని కూర్చుంది. కాదనుకోలేకపోతోంది.

"చాలా వున్నాయి. ఎందుకు?"

"ఇది బంగరంది కదా! రేపు కన్పించకపోతే మీ నాన్న అల్లరి చేస్తాడు. నువ్వు దొంగిలించావని తెలిస్తే చంపేస్తాడు. అందుకని ఓ పసుపుకొమ్ము నా మెళ్లో కట్టి దీన్ని తీసి లోపల దాచెయ్యి" అంది.

"ఊహుఁ! వుండనీ! నీ మెళ్లో ఎంతో అందంగావుంది. అయినా నాన్న చూస్తే ఏం కొంపమునుగుతుంది" సీత భయం అర్థం కావటంలేదు మోహన్‌కి.

"నేను నీ మొగుణ్నేగా" అన్నాడు నిర్ధారించికొందికి.

అవునన్నట్లు సిగ్గుతో తలవాల్చింది సీత. ఆ సిగ్గు ఎంతో నచ్చింది మోహన్‌కి. తనని ఎలా చూసుకోవాలో తనే కలుగజేసుకొని, చెప్పక తప్పదన్పించింది. 'ఈ విషయం ఎవరికి తెలిసినా పెద్ద గలాభా జరిగి తీరుతుంది. అందుకని ఎవ్వరికీ తెలియకూడదు. అతన్లో మార్పు తీసుకురావాలి? తెలియజెప్పాలి. ఇద్దరికిద్దరూ దగ్గరకావాలి! తెలిసి చేసినా, తెలియక చేసినా అతను తనభర్త! తను అతని భార్య' అనుకొంది.

"ఆకలిగా వుంది" అన్నాడు.

"అన్నం తిను"

"రా! ఇద్దరం తిందాం"

లోనికి వెళ్లాడు మోహన్. కాస్సేపటికి సీతని పిలిచాడు. పెరట్లో వేపచెట్టుకింద విస్తర వేసి అన్నం పెట్టాడు సీత కొరకు. తానో పళ్లెంలో అన్నం కలుపుకొంటూ—

"ఊఁ! తిను" అన్నాడు.

"ఆకలిగా లేదు" అంది. జగన్నాథం ఆ సమయంలో వస్తే ఏమవుతుంది? ఏమీ కాదు. అయినా సీతకి భయంగా వుంది.

"ఎందుకు లేదు?" ప్రశ్నించాడు. జవాబులేదు.

"ఛఛ! అలా అయితే నువ్వుపో! నాకు నువ్వు పెళ్ళానివి కావు" అన్నాడు కోపంగా. అతని కళ్ళల్లో తీక్షణత చూసింది. బాధ పెట్టడం మంచిది కాదనుకుని తినసాగింది.

"అన్నం పెట్టినతరువాత తినేయాల్సిందే. లేకపోతే నాకు భలే కోపం తెలుసా" అన్నాడు.

"వంట ఎవరు చేస్తారు?"

"నేనూ, మా నాన్న! ఏం నువ్వు వండి పెడతావా?"

"తక్కువ కులం వాళ్లు వండి పెడితే

తింటారా?"

మోహన్ జవాబివ్వలేదు. తటపటా యిస్తున్నాడు. ఆ అంతరాలు అతనికి అర్థం కావట్లేదు.

భోజనాలు చేశారు.

"నీళ్లు కావాలి" అనడిగింది. గ్లాసుతో తెచ్చి అందించాడు. తాగేసి గ్లాసును కింద బోర్లించి పెడ్తే - దాని మీద నీళ్లు జల్లి శుచిచేశాడు మోహన్.

"దాని మీద నీళ్లెందుకు జల్లావు" కావాలనే అడిగింది సీత.

"అంటు కదా! శుభ్రం చెయ్యాలి."

"గ్లాసు పైన నీళ్లు జల్లితే అంటు పోతుందా? ఆ గ్లాసుకి నా చెయ్యి తగి లింది, నా పెదవుల తడి తగిలిందిగదా?" అంది నవ్వుతూ. జవాబివ్వలేకపోయాడు. అనాదిగా వస్తూన్న ఆచారాన్ని పాటిం చాడు తప్పా - తప్పొప్పులు తెలుసుకో లేకపోతున్నాడు.

నాలుగు గంటల వేళప్పుడు జగ న్నాథం ఇంటికి వచ్చాడు. "అన్నం తిన్నావురా?" అనడిగాడు మోహన్‌ని. తిన్నానన్నట్లుగా తలూపాడు.

"నువ్వూ తిని వచ్చావమ్మా!"

"సీత కూడ ఇక్కడే భోంచేసింది" మోహన్ వకాల్తా పుచ్చుకొన్నాడు.

"మంచి పని చేసింది" అంటూ కుర్చీలో కూలబడ్డాడు. మోహన్ తల వంచుకొని రాసుకొంటున్నాడు. సీత అలవోకగా చేతిలో పుస్తకాన్ని తిర గేస్తోంది.

"ఆర్.యం.పికి ప్రైవేటుగా కట్టొచ్చు నట. ఇంటి దగ్గర వూరకనే వుండే బదులు ప్రైవేటుగా చదువుకోకూడ దమ్మా!" అన్నాడు సీతను చూస్తూ జగన్నాథం.

"ఆ వివరాలు నాకు సరిగ్గా తెలీవు బాబూ!" అంది.

"ఉద్దేశం వుంటే చెప్పు! నేను అన్నీ కనుక్కొస్తాను" అన్నాడు. సీత తలూ పింది.

"ఇక్కడిలా వుంటే మీ అమ్మలాగానే బతకాలి. చదువుకొన్నదానివి ఇంకా పైకి రావాలని ఆలోంచించు" అన్నాడు. అంటూ "అలా బజారుకి వెళ్లొస్తా"నని చెప్పి వెళ్లిపోయాడు. స్వేచ్ఛగా గాలి పీల్చాడు మోహన్. సీతని చూసి నవ్వాడు.

"మీ నాన్నంటే నీకు భయమా?" అడిగింది.

"లేదు! అయినా... !"

"నాన్నేమన్నాడు నీతో"

"అదా - నన్ను డాక్టర్ అవ్వమంటు న్నాడు. డాక్టర్నయితే డబ్బులు బాగా సంపాదించొచ్చు! చదవమంటావా?" అన డిగింది అతని ముక్కుపట్టి లాగుతూ.

"భలే! భలే! చదువు. చదివి నాకు జ్వరం వస్తే ఇంజీషన్ చెయ్యి"

"ఛీఛీ! నీకెందుకొస్తుంది జ్వరం! పైవాళ్ళకొస్తుంది కాని! వాళ్ళకొస్తే డబ్బులు పిండొచ్చు"

"డబ్బులు ఏం చేస్తావు?"

"మన సంసారం కోసం ఖర్చు పెడతాను"

"సంసారం అంటే?"

"మొగుడూ పెళ్ళాం" అంటూ నవ్వింది. మోహన్‌కి సిగ్గన్పించి మరి మాట్లాడలేదు. కాంతమ్మ వచ్చింది. "రా! ఇంటికి పోదాం" అంది కూతుర్ని. సీత వెళ్లిపోతూ అతన్ని చూసింది. అతడి చూపులు తన మీదే వున్నాయి.

 

కన్నార్పకుండా తదేకంగాచూస్తున్నాడు. బిడియపడిందది.




నాగులు తిరిగొచ్చాడు పల్లెకి. తన గురించి ఎవరూ ఏమీ అనలేదని ధీమాగా వుంది. కాంతమ్మకి ఈ విషయం తెలిసింది. అయినా మిన్నకుంది. అశుద్ధం మీద రాయి విసిరితే చెడు మనకేనని వూరుకొంది. వాడితో తగువు మంచిది కాదని కూతురికి చెప్పింది.

"జాగ్రత్తగా వుండు. జగన్నాథం బాబు ఇంట్లోనే వుంటూండు సాయంత్రం వరకూ" అంది. తలూపింది సీత.

క్రిస్టియన్ మిషన్ వాళ్ల వచ్చి పేద పిల్లలకి ఉచితంగా చదువు చెప్పిస్తామని, హాస్టల్ సౌకర్యాలుకూడా కలగజేస్తామని అంటే తల్లిని ఒప్పించి గోపీని వాళ్ల దరి చేర్పించే ఏర్పాటు చేసింది సీత. ఈ పల్లెల్లో వుంటే వృద్ధిలోనికి రాడని ఈ ప్రయత్నం చేసింది. కాంతమ్మ కూడా అంగీకరించింది. ఇహ తల్లీ, కూతురూ మిగిలారు.

"సీతను రాత్రి కూడా ఇక్కడే వుంచు. ఇద్దరూ కలిసే వుంటారు" అన్నాడు జగన్నాథం ఓ రోజు.కాంతమ్మ అనుమానంగా చూసింది అతడి వైపు. 'కూతుర్ని కోరుకుంటాడా ఎక్కడైనా' అని సమాధాన పడింది. ఆ ఆలోచనకే సిగ్గు పడింది. అయినా అదీ తన మంచికే అనుకొంది. బయట సీతను అందరూ గెద్దలా తన్నుకుపోవాలని చూస్తున్నారు. మోతుబర్లు ఏమైనా చేస్తారు. జగన్నాథం పంచన వుంటే ఈగైనా వాలదు. జగన్నాథం కూడ మరీ అవినీతిగా ప్రవర్తించడు.

ధైర్యం తెచ్చుకొని తల వూపింది చివరికి.

"కన్నందుకు ఆ ఇద్దరికీ దారీ తెన్నూ చూపాలిగా? గోపీనైతే మిషన్ వాళ్ళకి అప్పజెప్పేశాను. వాడి బాగోగులన్నీ ఇక వాళ్ళే చూసుకొంటార్ట! పోతే దీన్నో గట్టుకు చేరిస్తే సరి" అంది.

"దాని బాధ్యత మీదే! ఆ డాక్టరీ పరీక్ష ఏదో నీ చేతుల మీదుగానే అది పాసు కావాలి"

జగన్నాథం నవ్వాడు – "తప్పుతుందా" అన్నాడు.

*  *  *

ఊరవతల వేపచెట్టు కింద కూర్చొని వున్నాడు మోహన్. నాగులు ఒక్కడే అటుగా వస్తున్నాడు. ఇద్దరికిద్దరు ఒకసారి చూసుకొన్నారు. మోహన్‌కి నాగులు మీద చెప్పలేని కోపంగా వుంది.

"ఒరేయ్! వీణ్ణో పట్టు పట్టాల్రా" అన్నాడు పక్కనే వున్న బుచ్చితో. 'సరే' నన్నాడు బుచ్చి. శంకర్ లేచి తొడ చరిచి – "నిజంగానేర్రా! వాణ్ణో తాపు తన్నాలి" అన్నాడు ఆవేశంగా.

"రేపే వాడిపని పడదాం" అన్నాడు రమణ. మోహన్ ఏదన్నా కాదనే రకం కాదు వాళ్ళు. మర్నాడు తన్నాలని నిర్ణయించుకొన్నారు. గప్‌చిప్‌గా వూర్కొన్నారు.

సీత వాకిట కూర్చొని చదువుకొం

టూంది. మోహన్ రావడం గమనించి- "ఇంతవరకు ఎటు వూరేగారు దొరగారు" అంది. బదులివ్వలేదు మోహన్. జగన్నాధం ఈజీ ఛైర్లో కూర్చొని అంతా పరికిస్తూనే వున్నాడు. ఆమె ఎదురుగా వచ్చి కూర్చున్నాడు మోహన్. పెన్నూ, పుస్తకం ముందు వేసుకొన్నాడు.

"బాగా చదువుతున్నాడామ్మా?" అనడిగాడు జగన్నాధం.

"చదువుతున్నాడు బాబూ! త్వరలోనే మెట్రిక్ కట్టిస్తే సరి! ఆ తర్వాత ఇంటర్. నాలాగే ఆర్. యం. పి. చదివి డాక్టరవుతాడు" అంది మోహన్‌ని చూసి నవ్వి. జగన్నాధం దీర్ఘంగా నిట్టూర్చాడు.

"వాడికెందుకమ్మా చదువు? ఏదో నువ్వు ఇంటి పట్టున వుండి చెప్తున్నావు కాబట్టి ఈమాత్రం కుదురుగా కూర్చున్నాడు. నువ్వు వెళ్లిపోతే మళ్ళీ అడ్డగాడిదలా తయారవుతాడు" అన్నాడు. మరో అయిదు నెలల్లో తన చదువు పూర్తవుతోంది. తర్వాత ట్రైనింగ్ కోసం మూడు నెలలు టౌనుకుపోవాలి. అవయితే ప్రాక్టీస్ పెట్టుకోవచ్చు. తను లేకపోతే..జగన్నాధం బాబు మాట నిజమేనా? అడ్డగాడిదలా తిరుగుతాడా? అది సమస్య కాదు. మరి? తను దూరంగా వుంటే తనని మరిచిపోవచ్చునేమో! ఇంతలా అనుబంధాలు పెంచుకోడేమో ననుకొంది.

ఆ మర్నాడు వేపచెట్టు కింద అందరూ హాజరయ్యారు. అందరూ ఓ కొలిక్కి-వచ్చారు. మోహన్ చెప్పినట్టుగా అంతా చేస్తామన్నారు.



చీకటి పడుతూంటే నాగులు అటు వైపుగా వస్తున్నాడు. నోట్లో సిగరెట్ వుంది. శంకర్ ఎదురుగా వెళ్లి కావాలని 'ఢీ' కొన్నాడు నాగుల్ని. తర్వాత కింద పడి గట్టిగా అరిచాడు. ఆ అరుపుకు అందరూ పరుగెత్తుకొంటూ వచ్చారు. బుచ్చి నాగులు చొక్కా పట్టుకొన్నాడు ధైర్యంగా.

"ఏరా! మావాణ్ని ఎందుక్కొట్టావు?" అనడిగాడు.

"నేనెందుకు కొడతాను" అన్నాడు ఆశ్చర్యంగా నాగులు.

"కొట్టేడు! కొట్టేడు" అన్నాడు శంకర్ ఒంటికి అంటుకొన్న మట్టిని దులుపుకొంటూ. అనుకొన్న అవకాశం దొరికింది. అందరూ కలియబడ్డారు. నాగులు ఒక్కడిగా ఏం చేయలేకపోయాడు. పెద్ద వానర సైన్యంలా వుంది కుర్రజట్టు. నాగులు చొక్కా, పేంటూ చింపేశారు. దిక్కు తోచక నాగులు అరుస్తుంటే ఎవరో వస్తూన్న అలికిడైంది. తలోదారీ పారిపోయారు జట్టంతా. నాగులికి దుఃఖం ముంచుకొచ్చింది. సన్నగా ఏడుస్తున్నాడు.

"వాళ్ల జోలికెందుకెళ్లావు! రౌడీమూక అదంతా. వెళ్లు వెళ్లు!" అన్నాడొచ్చిన పెద్దమనిషి. నాగులు ఏం చేయలేక నోరు మెదపలేకపోయాడు. వాళ్లందర్నీ తిరిగి కొట్టే తాహతు తనకి లేదు. పలుకుబడి గల రైతుబిడ్డలు వాళ్ళు. ఏం ఎక్కువ తక్కువ జరిగినా నాగుల్ని వూరు మోతు బరులు సున్నం లోనికి ఎముక లేకుండా చేస్తారు. అందుకనే బెల్లంకొట్టిన రాయిలా వూరుకొన్నాడు.

మోహన్ ఇంకా ఇంటికి రాలేదు. లక్ష్మి వచ్చి సీతని అడిగింది - "ఇంట్లో బావ వున్నాడా" అంటూ. లక్ష్మి ఆదుర్దా చూసి "లేదు. ఏం జరిగింది" అడిగింది.

"నాగుల్ని బావా వాళ్ళు చితగ్గొట్టేశార్ట" అంది ఆందోళనగా.

"ఎవరెవరు?"

"అందరూ - బావా వాళ్లందరూ"

లక్ష్మి విచ్చీవిచ్చని పూవులా వుంది. దామన చాయలో బాగానేవుంది. ఇన్నాళ్లూ మోహన్‌ని లక్ష్మి భర్తగా అనుకున్నారు. ఇప్పుడు? మోహన్ సీత భర్త! ఆ విషయం చిన్నపిల్ల లక్ష్మికేం తెలుసు? లక్ష్మి ఆందోళనగా ఇంటికి వెళ్లిపోయింది. రాత్రి ఎనిమిది గంటలకి మోహన్ ఇంటికి వచ్చాడు. అతన్ని చూస్తూనే—

"నాగుల్ని కొట్టార్ట! నిజమేనా?" అడిగింది సీత.

"కొట్టాను! లేకపోతే నిన్ను వాడు పెళ్లి చేసుకొంటాడా" అన్నాడు. కళ్లల్లో నీళ్లు తిరిగాయి సీతకి. జగన్నాధం ఇంట్లో వున్నాడు. లేకపోతే మోహన్‌ని వాదేసుకోవాలన్నంత ఉత్సాహం కలిగింది.

"మరీ బరి తెగిస్తున్నావు. ఎప్పుడో నాడు నిన్నూ వాడు తంతాడు. అప్పుడు తిక్క వదలిపోతుంది" అన్నాడు జగన్నాధం. తలెగరేసి నిర్లక్ష్యంగా చూశాడు మోహన్. వచ్చి వీధి అరుగు మీద కూర్చున్నాడు. అతన్ని చూద్దామని లక్ష్మి మళ్లీ వచ్చింది.

"ఎందుక్కొట్టావట?" అనడిగింది.

"నీకెందుకు! నోర్మూసుకో" అన్నాడు విసుగ్గా. ఇన్నాళ్లూ లక్ష్మి అంటే ఏదో అభిమానం వుండేది. తన 'భార్య' అన్న భావం వుండేది. ఇప్పుడు మరది లేదు. సీత తన భార్య, లక్ష్మి కానేకాదు అనుకొన్నాడు. సీత మెళ్లో తాళికట్టడం తప్పా, ఒప్పా అని ఆలోచించడం లేదు. తాళి

కట్టాను కనుక సీత తన భార్య అని అను కొంటున్నాడు. ముందుముందు అది ఏయే పరిణామాల్ని సృష్టిస్తుంది? అది ఏయే పరిస్థితులకి దారి తీస్తుంది? అలా అయితే ఎలా నిభాయించుకోవాలని అతడేమీ ఆలోచించ టంలేదు. ఆ ఆలోచనే అతన్లో కలగా లని ఆశిస్తూంది సీత. ఆ ఆలోచనే అతన్లో కలగకపోతే విపరీత పరిస్థితులేర్పడ తాయని ఆమెకు తెలుసు. అప్పుడు ఏం చెయ్యాలి?అతన్ని వదులుకోవాలా? లేదు! అతన్నొదులుకొని తాను జీవించలేదు. అతన్లో ఆ ఆలోచనలు కలిగించాలి. అదీ అతి తక్కువ కాలంలోనే జరగాలి.తర్వాత ఎక్కడైనా కలిసి బతకొచ్చు నను కొంటూంది.

జగన్నాధానికి జ్వరంగావుందని అవతలి గదిలో పడుకొన్నాడు. హాలులో ఇద్దరే మిగిలారు. మోహన్ మంచం మీద పడు కొన్నాడు. కింద చాప మీద పడుకొంది సీత. రాత్రి పది గంటల వరకూ చదువుతూ కూర్చుంది. తర్వాత మరి చదవలేక పోయింది. ఏవేవో ఆలోచనలు! ఈ రోజు తాము ఇద్దరే ఆ హాలులో! తను చదివిన నవలలో హీరో హీరోయిన్‌ను చెరచడం వుంది. జీవితానికీ, వూహకీ చాలా తేడా అన్పించింది. చలిగాలి వీస్తోంది. నిద్ర పట్టడం లేదు. రోజులిలా గడవటం బాగా లేదు. తను అందుకోవాల్సిన చుక్కలు అంతరిక్షంలో వుండకూడదు. అందు బాటుగా వుండాలి ! తెగింపు ముఖ్యం.

అర్ధరాత్రి దాటింది. అయినా నిద్ర రావట్లేదు. మెల్లిగా లేచింది. ఆదమరచి వెల్లకిలాపడి నిద్రపోతూన్న మోహన్‌ని చూసింది. శరీరంలో విద్యుత్ ప్రసరించి నట్లైంది. నెమ్మదిగా అతని పక్కన కూర్చుంది. గుండెవేగంగా స్పందిస్తూంది. అతని ముఖంలో ముఖం పెట్టి దీర్ఘంగా నిశ్వసించింది. ఉలిక్కిపడి లేచాడు మోహన్. కళ్ళు తెరిచి చూస్తే ఎదురుగా సీత! లేచి కూర్చొని ఆశ్చర్యంగా చూస్తు న్నాడు. అతని నడుం చుట్టూ చేతులు బిగించింది సీత. బుగ్గల మీద ముద్దుల వర్షం కురిపించింది.

మోహన్‌కి కొత్తగా వింతగా వుంది అంతా. సీత చేస్తూన్న చిలిపి పనులకి అతడి శరీరం వేడెక్కిపోయింది. అతనూ ఆమె నడుం చుట్టూ చేతులు వేశాడు. ఆమె పెదాల్ని అందుకొన్నాడు. తనలో లీనం కావాలని సీత చేస్తున్న ప్రయత్నాలకి మోహన్ సరదాగా చేయూతనిచ్చాడు.

ఉదయం లేచి చూసింది సీత. మంచంలో తృప్తిగా నిద్రపోతూన్న మోహన్‌ని చూసి ఆప్యాయంగా అతగాడి బుగ్గలు నిమిరింది. మేల్కొన్నాడు. రాత్రి జరిగింది కలా, నిజమా అన్నది అర్థం కావట్లేదు. దగ్గిరిసా సీత! ఒకర్నొకరు చూసుకొని సిగ్గుతో తలలు దించు కున్నారు.




సీత ట్రైనింగ్‌కు వెళ్లాల్సిన సమయం దగ్గర పడింది. మరో మూడు నెలలో ఆ ట్రైనింగ్ పూర్తయితే తర్వాత ప్రాక్టీసు పెట్టుకోవచ్చు.

జగన్నాధం పరిస్థితి అప్పటికే బాగా దెబ్బతిని ఉంది. అనారోగ్యంతో కృశించి పోతున్నాడు. ఇంకెన్నాళ్ళో బతకడు. ఆ బాధే సగం అతన్ని కృంగదీస్తోంది. మోహన్ గురించి తలచుకొని ఏడుస్తున్నాడు. తనకు కాలం చెల్లితే వాడేమవ్వాలి? వాడికోసం వున్న పొలాన్ని అమ్మేసి మోహన్‌ని తీసుకొని అక్కగారి వూరు వలసపోవాలనుకున్నాడు.

తనమీద ఆధారపడిన కాంతమ్మ సంతానం గురించి కడవరకూ యోచించాడు. సీత ఇంటిడు పని చేసింది ఇన్నాళ్ళూ. అదిచూసి అయినవాళ్ళుకాని వాళ్ళూ నోరు నొక్కుకున్నారు. తక్కువ కులందాని చేతివంట తింటున్నాడని ప్రచారం చేశారు. పైగా సీతను లోపాయి కారిగా వుంచుకున్నాడని దుమారం లేపారు. ఇల్లు జరగక ఆ పిల్లను వంట సాయంచేయమన్నానని నెత్తిమొత్తుకున్నా ఊరు నమ్మింది కాదు.

సీత ట్రైనింగ్‌కు అయ్యేఖర్చు అతనే భరించడానికి సిద్ధపడటంతో మరీ గుసగుసలు పోయారు. నిజానికి తండ్రికి అంటగట్టిన సంబంధాన్ని కొడుక్కి అంటగడితే లోకులు కాకులు కాకపోను. కాని అది లోకానికి తెలిసిరాలేదు.

ప్రయాణమైపోతూ సీత మోహన్‌ని కౌగిలించుకుని "అల్లరిపాలవకు. నా ట్రైనింగ్ అయిపోతే ఇద్దరం హాయిగా బతకొచ్చు. అంతవరకూ నాన్నని కని పెట్టుకొని వుండు" అంటూ జాగ్రత్తలు చెప్పింది.

అయిదు నెలల పరిచయాన్ని ఒక్కసారిగా వదులుకోవలసి వస్తున్నందుకు బాధపడింది. తన జ్ఞాపకాలు అతనిలో ఎప్పుడూ ఇంకిపోకూడదు. అలా అయితే తను ఎడారిలో బాటసారిగా మిగులుంది. జాగ్రత్తపడాలి! ఎంత తొందరగా అతన్ని అందుకోవాలోనని ఆత్రుత చూపిస్తూంది. గడిచిన కాలం కలలా గడిచిపోయింది. అందుకు మోహన్‌కి ఎప్పుడూ కృతజ్ఞతగా వుండాలి. తర్వాత తనబాగు ఆ ఇంటిపెద్ద చూస్తున్నాడు. ఆ సహాయాన్ని కూడా మరచిపోలేదు. ఇన్నాళ్ళూ తన వ్యామోహంలోపడి మోహన్ చదువు కట్టిపెట్టేశాడు. ముందు ముందు బాగుపడతాడా లేదా అన్నది పెద్ద సమస్య!

ఆమె వెళ్ళిపోతూంటే మోహన్‌కు దుఃఖం ముంచుకొచ్చింది. ఆమె ఒడిలోనే ఆ రాత్రంతా తల పెట్టుకొని పడుకున్నాడు. ఉదయం ఎవరి తోవ వారిదయింది. సీత వెళ్ళిపోతూంటే వెర్రివాడిలా చూశాడు. ఆ చూపుల్ని తట్టుకోలేకపోయిందామె.

మేనత్తగారి వూళ్లో మోహన్‌కి ఎవరూ పరిచయం లేదు. తండ్రి బలవంతం మీద ఇక్కడికి వచ్చాడు. కావాల్సిన వాళ్లనంటి పెట్టుకొందామని జగన్నాధం వున్న వూళ్ళోని పొలాలమ్మి అదే డబ్బుతో అక్కగారి వూళ్లో ఎనిమిదెకరాలపొలాన్ని కొన్నాడు.

మరో రెండు నెలలు గడిచిపోయాయి. సీత నుండి మోహన్‌కి వుత్తరాలొస్తున్నాయి. ఇతగాడు జవాబులు ఇస్తున్నాడు.

జగన్నాధానికి కొడుకు గాలిపటంలా తిరగడం నచ్చలేదు. వీణ్ని దారికి తేవాలని ఆలోచించి వ్యాపారంలోకి దింపాడు. అడవిలో కలపని కాంట్రాక్టుకు తీసుకున్నాడు. కొన్నాళ్లు మోహన్ వ్యాపారాన్ని సజావుగా సాగించాడు. కాని అసలే




చిన్నవయసు. అనుభవంగల కాంట్రా క్టర్ల పోటీకి తట్టుకోలేక దానికి తిలోదకాలు ఇచ్చేశాడు. తర్వాత హోటల్ నడిపాడు మరో పార్ట్నర్‌ని చేర్చుకొని. అయితే అదీ దివాలా తీసింది. ఎందులో వేలు పెట్టినా నష్టం వస్తూంది. తనకీ వ్యాపారం వద్దను కున్నాడు. అనుభవం జీవితాన్ని నేర్పింది. జీవితాన్ని యధాతథంగా చిత్రీకరించాలను కున్నాడు. చిన్న చిన్న నవలలు రాయడం ప్రారంభించాడు. రెండు నవలలు రాసి అనేక మంది పబ్లిషర్స్‌తో ఉత్తర ప్రత్యు త్తరాలు నడిపేడు. లాభం లేకపోయింది. ప్రత్యక్షంగా కలవాలనుకొన్నాడు.విజయ వాడ ప్రయాణమయ్యాడు. అంతవరకూ అతనికి విజయవాడ ఏ వైపు వుందో కూడా తెలీదు. రైలు ప్రయాణం అంటే సరదా పడ్డాడు. అక్కడికి చేరుకొన్నాడు.

మరో లోకంలోనికి అడుగు పెట్టి నట్టయింది.ఎటుపోవాలో తెలియనిపరిస్థితి. స్టేషన్నుంచి బయటపడ్డాడు. ఆటోలు, రిక్షాలు చూసి ఎందులో పోవాలో తెలి యక తికమకపడ్డాడు. దేన్ని పిలవాలన్నా భయం. తెగించి ఓ రిక్షాని పిలిచాడు.

"ఏదో ఓ లాడ్జికి పోనియ్"అన్నాడు కూర్చుంటూ. సూట్‌కేస్ గట్టిగా పట్టు కున్నాడు. రిక్షావాడికి మోహన్ వాలకం అర్థమైపోయింది. విజయవాడల్లా తిప్పి ఓ లాడ్జిలో దింపాడు. రిక్షావాడు అడిగి నంతా ఇచ్చేశాడు మోహన్. 'బుద్ధిమం తుడు' అనుకొన్నాడా రిక్షావాలా.

రిసెప్షనిస్ట్ ఇంగ్లీష్‌లో అనర్గళంగా మాట్లాడుతోంది ఫోనులో. మోహన్‌కి ఆ వాతావరణం ఏమీ అర్థం కావట్లేదు. అతని పరిస్థితి చూసి పక్కనున్న మరో వ్యక్తి కలుగజేసుకొని రూమ్ఇప్పించాడు.

"ఏం పనిమీదొచ్చావు" అనడిగాడా వ్యక్తి.

"కొన్ని నవలలు రాశానండి! వాటిని పబ్లిషర్స్‌కి ఇద్దామని వచ్చాను"అన్నాడు.

"నువ్వు రచయితలా కన్పించడం లేదు. ఏదోపారిపోయి వచ్చిన బాపతులా కన్పిస్తున్నావు" అన్నాడవతలి వ్యక్తి.

మోహన్ సూట్‌కేస్ తెరిచి తను రాసిన నవలలని తీసి చూపించాడు.

"నీవేలే! సరేకాని ఎప్పుడయినా ఈ వూరొచ్చావా? ఇదే మొదటిసారా?"

"ఇదే మొదటిసారండీ"

"జాగ్రత్తగా వుండు బాబూ! ఇదో జంతర్ మంతర్ ప్లేస్!నేనీపక్కరూంలోనే వుంటున్నాను. అవసరపడితే పిలు ! సలహాలిచ్చి సహాయం చేస్తాను"అన్నాడు నవ్వుతూ.

మంచి స్నేహం దొరికినందుకు సంతో షించాడు. తర్వాత స్నానం చేసి, టిఫిన్ చేశాడు. బోయ్‌ని పిలిచి టాక్సీ కావా లన్నాడు. బోయ్ నవ్వుకొని ఆటోని పిలిచాడు. మోహన్ ఆటో దగ్గరకి వెళ్లి షోగ్గా కూర్చున్నాడు. డ్రైవర్ అవగతం చేసుకున్నాడు.

"ఎక్కడికండీ?" అనడిగాడు.

"ఏలూర్ రోడ్డు"

ఆటో రెండు నిమిషాల్లోనే ఏలూర్ రోడ్ సమీపించింది."ఎక్కడ దిగాలండే"

"కరుణశ్రీ పబ్లికేషన్స్" అన్నాడు. డ్రైవర్‌కి అదెక్కడో తెలీదు. ఆ సందూ, ఈ మలుపూ తిరిగి ఎలాగైతేనేం అతను కావాలన్న చోటుకి చేర్చాడు.

ఆటో దిగి ఆఫీసు మెట్లెక్కుతున్న మనిషిని చూసి షాపాయన 'ఎవరై వుంటారా?' అనుకొన్నాడు. మోహన్ అతని దగ్గరగా వచ్చి—

"నమస్కారమండీ" అన్నాడు.

"ఏం కావాలి బాబూ"

"నేను రెండు నవలలు రాశానండీ! మీరు ప్రచురిస్తారేమోనని తీసుకొచ్చాను" అన్నాడు సూట్ కేస్ తెరుస్తూ.

"కూర్చొండి"

కూర్చున్నాడు మోహన్. నవలలుతీసి చూపించాడు. రెండు మూడు పేజీలు అలా అలా తిప్పి అరమోడ్పుగాచూశాడు ఆయన. మోహన్‌కి తన నవలలు తప్పక ప్రచురణ జరుగుతాయని నమ్మకం ఎందుకో కలిగింది.

"చదవాలి! చదివి చెప్తాను. వీలైతే నీరూంకివచ్చి అన్ని విషయాలు మాట్లాడ తాను" అన్నాడు. వెళ్ళొస్తానని లేచాడు మోహన్. రోడ్డుదాకా సాగనంపాడు. ఆటో పిలిచి ఎక్కాడు మోహన్.

సాయంత్రం ఆ పబ్లిషర్ వచ్చాడు

"మీ నవలలు బాగానే వున్నాయి కాని భాష సరిగ్గా లేదు. పైగా కథ నడి పించే తీరు మీకు తెలీదు" అన్నాడు. మోహన్ నోరు మెదపలేదు.

"ముందు దేనికైనా అనుభవం కావా లయ్యా! అందుకని ఓసంవత్సరం ట్రైనిం గవ్వు. ఏదిఎలా రాయాలో తెలుస్తుంది. లేదా కనీసం ఓ అయిదు వేలుంటే ఇలాగే వేసేద్దాం" అన్నాడాయన.

'ఆయనే వుంటే మంగలాడెందుకు' అనుకొని 'ఆ అయిదు వేలు వుంటే నిన్ను దేవిరించడం దేనికి? హాయిగా నేనే ప్రచు రించుకొనేవాడిని' అనుకొన్నాడు. ఇది కుదిరే బేరం కాదని సరిపెట్టుకొన్నాడు. ఆ అనుభవంతో మరెవరినీ చూడకుండానే మర్నాడే వూరికి ప్రయాణమయ్యాడు.

* * *

జగన్నాథం కొద్ది రోజుల్లోనే గుండె నొప్పితో చనిపోయాడు. ఆ సమయానికి అక్కడ మోహన్ లేడు. అయినవాళ్ళు ఎవరూ వూళ్లో లేక చివరికి ఎలాగో శవాన్ని దహనం చేయించారు. తర్వాత పరుగెత్తుకు వచ్చాడు మోహన్. తన వారంటూ ఎవరూ లేని తరువాత తన కక్కడ స్థానం లేదనుకున్నాడు. పొలాలు అమ్మేశాడు. చిన్నప్పట్నుంచీ పనికిరాని మనిషంటూ అందరూ గేలి చేయడం వల్లా, నష్టపోయిన చిల్లర వ్యాపారాల వల్లా అతనంటే ఎవరికీ సదభిప్రాయం లేదు. అందుకే ఎవరూ పట్టించుకోలేదతన్ని.

ఈ జీవిత పోరాటంలో ఈ మధ్య కాలంలో సీతని పూర్తిగా మరిచి పోయాడు. ఆమె రాసిన ఉత్తరాలకు జవాబు లివ్వడంకూడా లేదు.

ఆ విధంగా సీతతో సంబంధాలు కోల్పోయాడు. ఏకాకిగా తయారై తనంతట తానుగానే నిలబడాలని ఊరు మారాడు. అక్కడ స్వయంగా ఓ ప్రచు రణసంస్థ ఏర్పాటు చేశాడు.

సంస్థ ఏర్పాటు చేసిన రోజునే ఓ వ్యక్తి వచ్చి కలిశాడు.

"నా పేరు విశ్వనాథం? ఇక్కడే మున్సిపల్ ఆఫీసులో జాబ్ చేస్తున్నాను. మా బంధువులమ్మాయి ఒకామె కథలు రాస్తోంది. మీరు ప్రచురిస్తారా ?" అనడి గాడు.

'నా కథలకే దిక్కులేదు. నేనే పొలం పుట్టా అమ్మి నావి అచ్చువేయించు కొంటుంటే ఇక నీ సంగతి, నీ బంధువుల సంగతి ఎవడిక్కావాలి ?' అనుకున్నాడు మనసులో. అయినా బయటకి సభ్యతగా "తీసుకు రావల్సింది వాటిని. చదివి అభి ప్రాయం చెప్పేవాడిని" అన్నాడు. మను మలని బెదిరించి మాట్లాడితే వ్యాపారం





సజావుగా జరగదని అనుభవం మీద తెలుసుకొన్నాడు. ఎంత మర్యాదగా మాట్లాడితే అంత మంచిదని తెలుసు న్నాడు.

"తప్పకుండా! నిజానికి మీరు మా ఇంటికొచ్చి మా ఆతిథ్యం స్వీకరించి, ఆ విషయము వివరంగా మాట్లాడితే నాకు ఆనందంగావుంటుంది" అన్నాడువితల్లావు. సరేనని తలూపాడు మోహన్. పరిచయాలు పెంచుకోవడం ద్వారా గుర్తింపు, గుర్తింపు ద్వారా కీర్తి, కీర్తి ద్వారా శాశ్వతంగా పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవచ్చని నెపోలియన్ నిరూపించాడు. తనూ ఆ పద్ధతిని అనుసరించడమే మంచి దనుకొన్నాడు.

ఆ రోజే మరో పది, పన్నెండు మంది తమ రచనల గోడు విన్పించడానికి తీరిగ్గా వచ్చారు. అందులో ఓ అరవై ఏళ్ళ ముసలి బ్రాహ్మడొకడు. అతను కావ్యాలు కోకొల్లలుగా రాసాట్ట! అవన్నీ గత నలభై ఏళ్ళుగా ముక్కి పోతున్నాయట. ప్రచురించే భాగ్యం ప్రసాదించమన్నాడు. వీలుకాదని అతనికి చెప్పేసరికి తల్లప్రాణం తోకకి వచ్చింది మోహన్‌కి. కేవలం నవలలు మాత్రమే ప్రచురిస్తామని చెప్పాడు. అయినా తుమ్మ జిగురులా వదలడు. ఇంకెవరికైనా రికమెండ్ చేయమంటాడు. కాదంటే కరకరమని నమిలేస్తాడనితెలిసి—"సరే చూద్దాంలెండి" అన్నాడు.

రాత్రి వేణు వచ్చాడు.

"ఎలావుందివ్యాపారం?" అనడిగాడు.

"ఏదీ! ఇదింకా ఆది! ఆఫీసుకు కావల్సిన సరంజామా అంతా కొన్నాను. ఉండడానికి ఇల్లు ఏర్పాటుచేసుకొన్నాను" అన్నాడు.

"నా బాధ మరేమీ లేదు. ఏ వ్యాపారంలోనైనా మెలుకువలు అవసరం. వాటిని బాగా నేర్చుకోమంటున్నాను" అన్నాడు వేణు.

వ్యాపారంలో మెలుకువలు వేణుకన్నా తనకే బాగాతెలుసు. మెలుకువలుకన్నా అందులోని మోసాలు మరీ తెలుసు. సంవత్సరం అనుభవంలోనే ఓ జీవితానుభవాన్ని సంపాదించాడు. ఆ విషయం వేణుకి తెలియదనుకొన్నాడు.

"ఇంతా దబ్బెంతుంది?" అడిగాడు వేణు.

"చాలా తక్కువ"

"ఎన్ని నవలలు ప్రచురిద్దామనుకొంటున్నావు?"

"సరిగ్గా అన్నీ సమకూరితే నాలుగు నవలలు ప్రచురిద్దామనుకుంటున్నాను. ఇక్కడ చక్కగా ముద్రించేవాడు కావాలి. అక్కడ అమ్మేవాడు కావాలి"

"జాగ్రత్తసుమీ" అని మిత్రుణ్ని అభినందించి వెళ్లిపోయాడు ఆరాత్రే వేణు.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకే ఆఫీసుకు వచ్చాడు. అప్పటికే బోయ్ వచ్చి కుర్చీలు, బల్లలు అన్నీ తుడిచి శుభ్రం చేశాడు. పూజాతో నీళ్లుంచాడు.

బీరువాలోని ఫైల్‌నొకదాన్ని తీసి చూశాడు మోహన్. ఏజంట్లు, జిల్లా గ్రంథాలయ సంస్థల ఎడ్రస్‌లు ఉన్నాయి. అందులో వాళ్లని బేరీజు వేస్తూ ఎన్ని కాపీలు అమ్మొచ్చునో అంచనా వేస్తున్నాడు. ఈ కొద్దిరోజుల్లో ఆ ఎడ్రస్‌లు మాత్రం సంపాదించగలిగాడు.

సాయంత్రం ప్రెస్ దగ్గరికెళ్లాడు. ఊళ్లో ఆ ప్రెస్ చెప్పుకోదగ్గది కాకపోయినా ఫర్వాలేదు. గతంలో దాని యాజమాన్యం కూడా కొన్ని నవలలు ప్రచురించారు. అందువల్ల వాళ్లనే సంప్రదిస్తే

మంచిదనుకొన్నాడు.

"మాది చిన్న ప్రెస్. మాకు జాబ్‌వర్క్ ఎక్కువ. తక్కువ రేటుమీద వర్కర్లు మాకు దొరకరు" అన్నాడు ప్రెస్ యజమాని.

"ఎన్ని రోజుల్లో ప్రచురిస్తారు ఓ పుస్తకాన్ని?"

"పేజీల్ని బట్టి వుంటుందండీ"

"సుమారుగా వంద పేజీలుంటుంది"

"టైటిల్ కవర్ ఎక్కడ వేయిస్తారు"

"అదంతా విజయవాడలో"

"అయితే ఓ నెలలో ముద్రించగలం. అంతకు ముందంటే ఇబ్బందే! పేపరు మీరు తెప్పించుకొంటే ఫర్వాలేదు. లేదూ మమ్మల్నే తెప్పించమంటే మేమే తెప్పిస్తాము" అన్నాడు. వెంటనే పేపర్‌కి కావల్సిన డబ్బు, ఓ నవల మాన్యుస్క్రిప్టు అతని కందించాడు మోహన్. రేపే విజయవాడ నుండి పేపర్ తెప్పిస్తామని, రెండు మూడ్రోజుల్లో ముద్రణ ప్రారంభిస్తామని యజమాని చెప్తే 'సరే' నని కదిలాడు.

విత్రలావు దారిలో కలిసి ఇంటికి ఆహ్వానించాడు. పక్క సందులో వాళ్ళ ఇల్లు. పెద్ద హంగామాగా హాల్లో కుర్చీలూ అవీ వేశాడు. ఇంట్లో ఎవరూ లేనట్టుంది. కొద్దిసేపట్లోనే కాఫీ తెచ్చిచ్చాడు. వద్దని మొహమాటం పడుతూనే కాఫీ తీసుకొన్నాడు.

"ఆ అమ్మాయి రాసిన నవలలు తీసుకురండి. చూద్దాం" అన్నాడు మోహన్.

"సినిమాకి వెళ్ళిందండీ. టైమయింది- వచ్చేస్తుంటుంది" అన్నాడు క్షమాపణగా. మరో పదినిముషాల్లో ఆవిడ రానేవచ్చింది.



మనిషి ఆరోగ్యంగా వుంది. పెదవులకి లిప్‌స్టిక్ రాసింది. కళ్లకి కాటుక, పక్క పాపిటతో స్వతహాగా అందగత్తె కాకపోయినా, అలంకరణతో అందాన్ని దిద్దుకొంటోంది.

"ఈయనే మోహన్‌గారు" విశ్వలావు పరిచయం చేశాడు. ఆమె సమస్కారం చేసింది.

"కాఫీ తాగారా?" అనడిగింది.

"తాగానండీ" అన్నాడు మోహన్. ఆమెను పరికించిచూస్తున్నాడు. ఎక్కడో చూసినట్లు గుర్తు. జ్ఞాపకం రావట్లేదు.

''ఈవిడేనండీ రచయిత్రి. మంచి నటి కూడా" అన్నాడు విశ్వలావు. ఎదురుగా కూర్చొన్న ఆమెతో మాట్లాడకపోవడం సంస్కారం కాదని "మీ పేరు" అనడిగాడు.

"కుమారి అండీ! నటనతోపాటూ ఈ రచన కూడా వంటపట్టింది. ఏవేవో రాశాను. మీరు ప్రచురిస్తారేమోనని విశ్వలావును అడిగి రమ్మన్నాను" అంది.

ఇంత లేతవయస్సులో ఈ కుర్రాడికీ వ్యాపారం ఏమిటి అనుకొంది. మనిషి అందంగా వున్నాడు. మంచి సూట్ వేసుకున్నాడేమో ముద్దు పెట్టుకోవాలన్పిస్తోంది కుమారికి మోహన్‌ని చూస్తూనే.

"తీసుకురండి చూద్దాం" అన్నాడు.

ఆమె లేచి లోనికి వెళ్లింది. విశ్వలావు కూడా వెళ్లిపోయాడు. తర్వాత ఆమె ఒక్కర్తే వచ్చి రెండు బౌండు పుస్తకాలు అందించింది.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం" అన్నాడు మోహన్.

"మీదేవూరు" ప్రశ్నించింది కుమారి. చెప్పాడు మోహన్.

"అదీ సంగతి! చింతామణి, కన్యాశుల్కం నాటకాలు వేయడానికి అక్కడికి వచ్చేను! అప్పుడు చూసుంటారు" అంది.

ఆశ్చర్యంగా ఆమెను చూశాడు. ఔను అప్పట్లో తలుపులు వేసుకొని ఎవర్నీ రానివ్వకుండా గాంధీ సత్రంలో రిహార్సల్స్ వేసేవారు. అప్పట్లో కుమారి పిల్లకాయలందరికీ స్వప్నసుందరి. ఆమె అందాన్ని ఎంతో ఆరాధించేవాడు. ఈ నాటికి మళ్లీ కుమారిని అతిసన్నిహితంగా చూస్తున్నాడు. ఆ రోజుల్లో సన్నగా ఉండేది. ఇపుడు కొంచెం లావెక్కింది. కడుపు దగ్గర ముడతలు పడ్డాయి.

''ఏమిటా చూపు! దిష్టితగిలేను" అంది నాటకఫక్కీగా – పైట సరిచేసుకొంటూ. మోహన్ తల వంచుకొన్నాడు. తనకంటే కనీసం ఏడెనిమిది సంవత్సరాలు పెద్దది! అయితేనేం! ఆకర్షిస్తోంది.

"ఉండండి. ఇప్పుడే వస్తాను" అంటూ లోనికి వెళ్ళింది. ఆలోచిస్తూ కూర్చొన్నాడు.

ఇన్ని రోజులై నానా బాధలూ, కలతలూ మధ్య సీత గుర్తుకు రానేలేదు. చూసి సంవత్సరమయింది. ఏంచేస్తోందో!? ప్రాక్టికల్ కోర్సులు పూర్తయి పది నెలలన్నా అయివుంటుంది. స్వంతంగా ప్రాక్టీసు పెట్టేవుంటుంది. ఆస్పత్రిని ఎలా నడుపుకొస్తోందో?

కళ్లనీళ్ళ పర్యంతం అయ్యాడు మోహన్. ఆ అయిదు నెలలూ కలతలూ, బాధలూ లేని స్వర్గంలోనికి తీసుకు వెళ్లింది. ఇద్దరికీ తెలిసీ తెలియని జీవితం! ఆ జీవితంలో ప్రతి నిముషం ఆనందం కోసమే వెచ్చించారు. తాను కట్టిన తాళి తెంచుకోలేకపోయింది. ఆనాడు – వెళ్తూ వెళ్తూ చూసిన చూపు ఈనాటికి కూడా




తన గుండెల్లో కలుక్కుమంటోంది.

సీత తన భార్య! నిజమే. చేజేతులా కట్టిన తాళిని తనెలా మరచిపోతాడు? తను సీతకి భర్త! ఆ తాళిబొట్టు కోసం తండ్రి ఎంత యుద్ధం రేపాడు! ఓ రోజల్లా తిండి పెట్టక వీధుల్లో తిరగమన్నాడు. ఓరోజల్లా తన్నాడు. వొంగిలించి అమ్మేశానని నిందించాడు. అయినా తను సీత భర్తగా నిజం చెప్పలేదు. నిజంచెప్తే సీత నేమైనా చేస్తాడు తండ్రి. అందుకనే చెప్ప లేదు. ఆఖరికి విసిగెత్తి పోయింది లెమ్మని వూరుకొంటే - అది సీత మెళ్లో నిండుగా నిలిచిపోయింది.

ఆ తాళిబొట్టుకి సీత విలువనిస్తోందా? తానైతే దాన్ని పవిత్రంగా భావిస్తున్నాడు. మరి ఆమె ఏం చేస్తోందో? ఎక్కడుంది, ఏమైంది? అనేకానేకంగా ఆలోచనలు మోహన్ మెదడును కుమ్మేస్తున్నాయి. సీతను కలుసుకోవాలి. సీత సమాచారం తెలుసుకోవాలి.ఇద్దరి అనుబంధాన్ని నెమరు వేసుకోవాలి! ఎలా? ఎలా సాధ్యం అది?

కుమారి వచ్చి ఎదురుగా నిలబడింది.

"ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?" అంది నవ్వుతూ. తల తిప్పి చూశాడు మోహన్. ఎదురుగా పల్చని చీరలో అంగాంగాలు అన్నీ కన్పిస్తూ కవ్విస్తు న్నాయి. అప్పుడే స్నానం చేసి వచ్చి నట్టుగా వుంది - కురులు నుదుటి మీద అంటుకొని వున్నాయి. సెంటు వాసన 'గుప్' మంటోంది.

"మీరలా చూస్తుంటే భయంగా వుంది" అంది కవ్విస్తూ. నవ్వాడు ఆ మాటలకి. "ఏదో ఆలోచిస్తున్నాను వెళ్లొస్తానండి" అన్నాడు. "రేపు మీవి చదివి ఏ విషయం చెప్తాను."

"భలేవారండి ! ఇప్పుడెక్కడికి ? ఇక్కడ నా ఆతిథ్యం మీరు స్వీకరించాలి. లేకపోతే నా మీద ఒట్టే" అంటూ బుంగ మూతి పెట్టింది.

"వద్దండి ! ఇబ్బంది పెట్టొద్దు" అన్నాడు.

"ఊహుఁ! అలా అయితే నేను చాలా బాధపడతాను ! ప్లీజ్ ! ఈ ఒక్క రాత్రికి..." అంది అభ్యర్థిస్తున్నట్లుగా. కళ్లలోకి చూశాడు. సీత ఆనాటి రాత్రి చూసిన చూపు జ్ఞప్తికొచ్చింది. శరీరంలో ఏదో విద్యుత్ ప్రసరిస్తున్నట్టుగా వుంది. ఎక్కడో నరాలన్నీ వేడి వేడిగా కరుగు తున్నట్టుగా వున్నాయి. మోహన్ తమా యించుకోలేకపోతున్నాడు.

భోజన ఏర్పాట్లు చేసింది. తనే స్వయంగా అన్నం తినిపించింది. మోహన్‌కి అంతా చిత్ర విచిత్రంగావుంది. ఒకనాడు ఆమె అతగాడి వూహాసుందరి! మరిప్పుడు కొన్ని క్షణాల్లో తన వశం కాబోతోంది. 'ఎంత వ్యత్యాసం' అన్పిం చింది.

"ఈ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసు కోండి" అంది వళ్లు విరుచుకొంటూ. నవ్వుతూ తలూపేడు. అందివచ్చే ఆనందాన్ని కాలదన్నుకోవడం శ్రేయ స్కరం కాదనుకొన్నాడు. సంవత్సరం తర్వాత తిరిగి స్వేచ్ఛగా ఆ రోజు కుమారిని తన కౌగిట్లోకి తీసుకొన్నాడు. వెచ్చని గిలి ! నులివెచ్చని చలి ! ఏవో లోయల్లోకి జారిపోతున్నాడు.

చీకటితోనే లేచి ఇంటికి వచ్చాడు. స్నానంచేస్తూ ఆలోచించాడు. తాను సీతను మోసం చేస్తున్నాడా? తాళికట్టి మొగు ణ్ణనిపించుకొన్నాక ఇలా చేయడం ఎంత వరకూ సబబు ? సీత ఎలా వుంది ?

ఏ జీవితాన్ని అనుభవిస్తూంది? తనలాగే తపనల్ని చల్లార్చుకోటం లేదుకదా?

-ఆ ఆలోచనకే సిగ్గుపడ్డాడు.

ఆఫీసుకు వచ్చాడు. ఏజంట్లకి 'ఫోల్డర్స్' పంపుతూ కవర్ల మీద ఎడ్రసులు రాస్తూ కూర్చున్నాడు. బోయ్ గడపనానుకుని వీధిలోనికి చూస్తూ కూర్చున్నాడు.

మధ్యాహ్నం అయింది-

పహిల్వాన్ లాంటి ఓ వ్యక్తి లోనికి వచ్చాడు. అతని వెనుక నాజుగ్గా, అందంగా వున్న ఓ అమ్మాయి వుంది. ఇద్దర్నీ మార్చిమార్చి చూశాడు మోహన్. "కూర్చొండి" అన్నాడు మర్యాదగా.

"మా అమ్మాయి ఏవో రెండు నవలలు రాసింది. వీటైతే ప్రచురిస్తారేమో నని వస్తున్నాం" అన్నాడతను.

ఆ నవలల్ని తీసుకొని తన తలకేసి కొట్టుకోవాలనిపించింది. దేశంలో రాసే వాళ్ల సంఖ్య వేలమీదుగా వుంది. చదివే వారి సంఖ్య పదుల్లో వుంది. అందరూ కుప్పలు తెప్పలుగా రాసేస్తున్నారు. తనకే వేసే దిక్కులేక స్వయంగా వేసుకొందా మని ఈ ప్రచురణ ప్రారంభిస్తే, వీళ్లందరూ తమవి వేయాలంటూ వెంటపడటం చిరాగ్గా వుంది. అయితే తనప్పుడే పెద్దమేధావిగా, బిజినెస్ మాగ్నట్‌గా అందరూ గుర్తించడం మోహన్‌కి సరదాగానే వుంది. అందుకే ఆ వచ్చిన వాళ్లని నిర్లక్ష్యంగా చూడలేదు.

"ఇవ్వండి. పరిశీలిస్తాను" అన్నాడు. ఆ మాటకి అవతలి వాళ్లు సంతోషిస్తారని తెలుసు. వద్దంటే బాధపడతారు. అందుకే ఆ విధంగా మాట్లాడడం 'టెక్నిక్'గా గుర్తించాడు.

ఆ అమ్మాయి తన నవలల్ని మోహన్‌కి అందించింది.

"ఎప్పటి నుండి రాస్తున్నారు?" అనడిగాడు ఆ అమ్మాయి వైపు చూస్తూ. పెద దేమీ కాదు. దాదాపు తన వయసే. సరికిణీ, వోణీ వేసుకొంది. రెండు జడల నడిపాపిట తీసింది.

"ఏదో సరదాగా రాసానండి"

"చదువుకొంటున్నారా?"

"అవునండీ! ఇంటర్మీడియట్" అంటూ నవ్వింది. "చాలా రాశాను. నాకే నచ్చక చింపేశాను. అందులో మంచివి ఈ రెండూ. దయచేసి ప్రచురించండి" అంది.

"మీపేరు?" అనడిగాడు మోహన్.

"వహీదా" అంది కళ్లు గుండ్రంగా తిప్పుతూ. నవ్వి ఊరుకొన్నాడు మోహన్. కాసేపుండి వెళ్లిపోయారు. సాయంత్రం కుమారి దగ్గరికి వెళ్లాడు.

"ఈ రాత్రి కూడా మీరిక్కడే వుండాలి" అంది కుమారి సొగసులు వొలకబోస్తూ.

"తప్పదు కదా!" అన్నాడు.

"తప్పించుకోవాలనుకొంటే-తప్పించు కోండి" అంది కవ్వింపుగా మీది మీది కొస్తూ.

కుమారి ప్రేమను కురిపిస్తోంది. అంతా నటన! రేపు తప్పకుండా తనని ఎలా ఉపయోగించుకోవాలో ఆమెకు తెలుసు! అన్నీ తెలిసి కూడా తనెందుకు ఇలా ప్రవర్తిస్తున్నాడనేది మోహన్‌కి అంతు పట్టటం లేదు. స్పష్టాస్పష్టంగా గుండెల్లో ఒకే ఒక్క ఆలోచన వుంది. తన కష్టాల్నీ, ఆలోచనల్నీ పంచుకొందుకి స్నేహితురాలు కావాలి! కాదు. తనకి శరీరసుఖం కావాలి. ఎదుగుతూన్న వయసులో కోరికల్ని చంపుకోవడం సాధ్యం కాదు.




ముందు ముందు పర్యవసానాలు ఎలా వున్నా ఈ క్షణం మధురం అనే మనస్తత్వాన్ని నింపుకొన్నాడు అతను.

రాత్రి సినిమాకు వెళ్లాడు. వహీదా కన్పించిందక్కడ. పలకరిస్తుందను కొన్నాడు.

"బాగున్నావా మోహన్" ఆ గొంతుకి వెనుతిరిగి చూశాడు. నాగులు!

"ఎక్కడుంటున్నావు?" నమ్రతగానే ప్రశ్నిస్తున్నాడు నాగులు.

"ఇక్కడే" సమాధానమిచ్చాడు మోహన్.

"వ్యాపారం చేస్తున్నావా?"

"అవును"

"బాగా సంపాదిస్తుండాలి అయితే" అన్నాడు నవ్వుతూ. ఆ నవ్వు వెనక ఏదో హేళన తొంగిచూసింది. మోహన్‌కి వాడి వివరాలు అవసరమన్పించింది. "నువ్వేం చేస్తున్నావు?" అనడిగాడు.

"ఆర్. యం. పి. చదివి, డాక్టర్నయ్యాను" అన్నాడు. 'నీకన్నా నా స్థాయి పెద్దది. సరిగ్గావుండు' అన్నట్టుగా వున్నాయి అతగాడి మాటలు. ఆర్.యం. పి.అనగానే సీత గుర్తుకొచ్చింది.

"సీత ఎక్కడుంటోందిప్పుడు?" ఆత్రంగా ప్రశ్నించాడు మోహన్. నాగులు వ్యంగ్యంగా నవ్వాడు.

"మీ నాన్న వుంచుకొన్నదాని వివరాలు నీకు బాగా తెలుస్తాయి. తెలీవంటే నేను నమ్మను"

ఇబ్బందిగా వుంది మోహన్ పరిస్థితి. "ఎక్కడుంటోంది?" రెట్టించాడు.

"ఇప్పుడు పేద్ద డాక్టరమ్మది. బాగా సంపాదిస్తూంది. అయినా నీకెందుకా వివరాలు? మీ నాన్నకి కావాలిగాని..."

మోహన్ భరించలేకపోతున్నాడా మాటల్ని. అక్కడికక్కడే నాగుల్ని కింద పడేసి నరికేయాలనిపించింది. అయినా సహిస్తున్నాడు. ఇది పల్లెటూరు కాదు- పదిమందీ తనని వెనకేసుకు రావడానికి. అందుకనే జాగ్రత్త వహిస్తున్నాడు. ఈ పిచ్చి వెధవకి నిజానిజాలు తెలీక వాగుతున్నాడనుకొన్నాడు.

"చితికి పోయిన మా కుటుంబానికి ఏదైనా సహాయం చేస్తుందని" అన్నాడు వివరాలు సేకరించాలన్న పట్టుదలతో. సీత ఎక్కడుంటున్నదీ చెప్పేడు నాగులు. అదే వూళ్ళో వుంటోందట. అయినా కలుసుకోలేకపోయానని బాధపడ్డాడు.

"మీ అమ్మతో నేను అడిగేనని చెప్పు" అన్నాడు నాగులు కసిగా. వళ్లు మండుకుపోయింది మోహన్‌కి. నిభాయించుకొన్నాడు. వీలైతే కలుస్తానని చెప్పి వెళ్లిపోతూ- "రోజుకో రకంగా మగాళ్లని మార్చే మీ అమ్మకి నా నమస్కారాలందజేయి" అన్నాడు మళ్లీ.

ఆలోచిస్తూ నిలబడ్డాడు మోహన్. వహీదా పలకరించింది.

"సినిమాకి వచ్చారా?" అంది.

"అవునవును" అన్నాడు. మరక్కడ నిదబడలేకపోయాడు. నాగులు మాటలు అతని మెదళ్ళో వెయ్యి విచ్చు కత్తుల్ని గుచ్చాయి. ఎంత అసహ్యంగా మాట్లాడాడు? సీత తనకి తల్లా? ఛీఛీ! వూహించడానిక్కూడా బాధపడ్డాడు. రోజుకో రకంగా మగాళ్ళని మారుస్తున్నదా! నిజమా?

మోహన్‌ముందు ఎన్నెన్నో ప్రశ్నార్థకాలు నిలిచాయి. 'రోజుకో రకంగా మగవాళ్ళనిమారుస్తూ అనుభూతుల్ని తనలాగే సీత కోరుకొంటూందా?' అన్పించింది. తను సీతని మరచిపోయాడు. చెడిపోయాడు.



అలాగే సీతకూడా తనని మరచిపోయి క్షణికోద్రేకాల్ని తట్టుకోలేక చెడిపోవచ్చు కదా!

బాగా సంపాదిస్తోందని నాగులు చెప్పాడు! డబ్బునే కాదు హోదా, పలుకుబడి కూడా సంపాదించి వుంటుంది. తనంతట తానుగా వెళ్తే ఎదురొచ్చి పలకరిస్తుందా! అసలు వెళ్దామా? వద్దా? అన్న ద్వంద్వంలో కొట్టుకొంటున్నాడు. సీతని గురించి ఆలోచనల్ని తట్టుకోలేక కుమారి ఇంటికి నడిచాడు.

* * *

ట్రైనింగ్ అయిన తరువాత రెండు నెలలు పల్లెలోనే గడిపింది సీత. మోహన్‌కి వుత్తరాలు రాసినా జవాబులు లేవు. జగన్నాథం చనిపోయాడని తల్లి చెప్తే చాలా బాధపడింది. తనకెంతో సహాయం చేసిన దేవుడనుకొంది జగన్నాథాన్ని. ఆస్పత్రి తెరిచి, ప్రాక్టీసు పెట్టాలంటే డబ్బుకావాలి. ఇప్పుడు సహాయం చేసేవాళ్లు మరెవరూ లేరు. ఎలా ముందు జీవితం అని ఆలోచించింది. నగా నట్రా వుంటే తెగనమ్మి ప్రాక్టీసు ప్రారంభిద్దామనుకొంటే – ఆమె మెళ్ళో వున్న ఒకేఒక నగ – మోహన్ కట్టిన తాళిబొట్టు! తెంచుకోనూలేదు. తెగ నమ్మనూలేదు. చివరికి వున్న ఇల్లు అమ్మి ఆస్పత్రి ప్రారంభించింది.

ఈ దేశంలో రోగాలకి అంతూ పొంతూ లేదు. ఇక్కడ వైద్యవృత్తే కలిసొచ్చే వ్యాపారం.

సీత అదృష్టం బాగుంది. ఆమె హస్తవాసి చాలా మంచిదన్నారందరూ. మెల్లమెల్లగా ఆస్పత్రి బలాన్ని పుంజుకొంది. ఇద్దరు నర్సులను ఏర్పాటు చేసింది. గోపీని పట్నంలో చదివిస్తోంది.

రూంలోకి వస్తూన్న మనిషిని రెండు నిమిషాలు పరిశీలించి చూసింది సీత. ఆ వ్యక్తి మోహన్ అని గుర్తించడానికి క్షణం చాలు! అయితే అతగాడున్న వేషాన్ని చూసి ఆశ్చర్యపోతోంది. ఉలెన్ సూటులో అందంగా మెరిసిపోతున్నాడు మోహన్. వచ్చి, ఎదురుగా నిలబడి పలకరింపుగా నవ్వాడు. సీత కూడా నవ్వి– "కూర్చో" అంది నిర్లిప్తంగా. తనని చూసి సంబరపడుతుందనుకొన్న సీతలో ఆ నిర్లిప్తతను భరించలేకపోయాడు మోహన్.

"ఇన్నాళ్లూ ఏమయ్యారు వారవారు?" అంది.

క్షమాపణగా, ఒక్కొక్కటీ పూస గుచ్చినట్లుగా చెప్పుకొచ్చాడు అన్నీ.

"గుడ్! రచయితవి అయ్యావన్న మాట. ఇంకేం గొప్పవాడివే" అంది పకపకా నవ్వుతూ.

"మగాడన్నాక డబ్బు సంపాదించాలి. ఎలా అని ఆలోచించాను. ఎన్నెన్నో చేశాను. అన్నీ విఫలమయినాయి. ఇప్పుడీ పబ్లికేషన్ చేపట్టాను. దీనిలోనన్నా సంపాదించాలనుకొంటున్నాను" అన్నాడు.

"పెద్దపెద్ద వాళ్ళే ఈ వ్యాపారాన్ని నమ్ముకొని మట్టికొట్టుకుపోయారు. అందులో నువ్వెంత? ఏదైనా ఆలోచించి చెయ్యాలి." అంది సీత. తనకి చాలా వ్యతిరేకంగా వినిపిస్తూన్న ఆ మాటల్ని సహించలేకపోతున్నాడు మోహన్.

పేషంట్ నెవరినో పరీక్షిస్తూంది సీత. ఆమెను చూస్తూ అలా కూర్చున్నాడు. పేషెంట్ వెళ్లిన తర్వాత అతనివైపు చూస్తూ – "నీ ఘనకార్యాలు చాలా గొప్పవి. కన్నతండ్రి ఛసే కాల్చేదాని క్కూడా ఇంట్లో లేకపోయేటంత సంపా

దనాపరుడివి అయ్యావన్న మాట" అంది. జవాబు చెప్పలేదతడు. ఏదేదో చెప్పి ఆమెను మచ్చిక చేసుకోవాలనుకోవట్లేదు మోహన్. నర్సును పిలిచింది సీత. ఇంటికి వెళ్తున్నట్టుగా చెప్పి బయల్దేరింది. ఆమె వెంట మోహన్ కదిలాడు. పరికిణీల్లో వుండే సీత ఖరీదైన చీరల్లో 'డాక్టర్ సీత'గా దర్శనమిస్తోందను కొన్నాడు. ఒకప్పుడు సీత తన స్వంతం- మరిప్పుడు తన చేయి దాటిపోయింది. ఆ సీత కాదు ఈ సీత! పరిస్థితులన్నీ ఎలా వ్యక్తంచాయన్నది మోహన్‌కి అంతు పట్టడంలేదు.

ఇద్దరూ ఇంటికి చేరుకొన్నారు. మోహన్ చేపట్టిన పబ్లికేషన్స్ గురించి సతమతమవుతోంది సీత. అందులో దిగినవాళ్లలో చెడినవాళ్ల సంఖ్యే హెచ్చు. అదో రొంపి! రచయితలు, రచయిత్రులు పబ్లిషర్స్‌ను ఏ విధంగా నాశనం చేస్తారో తను కర్ణాకర్ణిగా వింది. మోహన్ చితికిపోతే బాధపడేవాళ్లు లేరు. అతన్ని గురించి ఈ లోకంలో ఇంతో అంతో బాధననుభవించేది తను ఒక్కర్తే. భర్త నవ్వులపాలయితే భార్యగా తన కర్తవ్యం ఏమిటన్నది ఆలోచిస్తున్నది సీత.

కాంతమ్మ మోహన్‌ని చూస్తూనే గుర్తుపట్టలేకపోయింది. ఆ రోజుల్లో - నిక్కర్లలో తిరిగే మోహన్ మాత్రమే ఆవిడకి గుర్తు. రెండు సంవత్సరాల కాలంలో అతగాడెంతగా మారిపోయాడో! సూట్‌లోవున్న వ్యక్తిని తేరిపార చూస్తేనే గాని 'ఫలానా' అని పోల్చలేకపోయింది.

"ఎప్పుడొచ్చావు బాబూ?" అంది ఆనందంగా లేచి కాంతమ్మ.

"ఇప్పుడే" అన్నాడు మోహన్. కాంతమ్మలో కూడా చాలా మార్పులు వచ్చాయి. ఆనాడు తిండికి తికాణా లేని కాంతమ్మ కాదీ కాంతమ్మ అనుకొన్నాడు.

"భోజనం చేస్తావా?" అనడిగింది సీత. మోహన్ అడ్డంగా తలూపాడు.

"హోటల్ తిండి అలవాటైంది. పోతాను" అన్నాడు. సీత తీక్షణంగా చూసింది అతనివైపు.

"అయితే ఇంట్లో తినకూడదని నియమమా?" అంది.

"ఇద్దరికీ వడ్డించమ్మా!" అంది తల్లి నుద్దేశించి.

"ఆ బాబు మనలాంటి వాళ్ళ ఇళ్లలో తింటాడా?" సంశయం వెలిబుచ్చింది కాంతమ్మ.

"ఎందుకు తినడు? వీలైతే మనుషుల్ని కూడా తినే రకంలే" విసుగ్గా అంది సీత.

'సరే'నంది కాంతమ్మ.

"ఎందుకలా తల్లి మీద విసుక్కొంటావు! అప్పుడే అందర్నీ మరిచిపోయే స్థితి కొచ్చావా?" అనడిగాడు మోహన్ కోపంగా.

"పెద్ద మగాడివిలే చెప్పొచ్చావు! నీకన్నా నేనే నయం" అంది - అతని చెవి పట్టుకొని కూర్చోబెడుతూ. ఆ చేతిని అందుకొన్నాడు మోహన్. సీత కళ్లల్లోనికి చూశాడు. ఆ కళ్లు ఆర్ద్రమవుతున్నట్లుగా కన్పిస్తున్నాయి. బాధ పడుతూందేమోనని భీతి చెందాడు.

"భోజనం చేసి తీరిగ్గా మాట్లాడుకుందాంరా!" అంది. అతన్ని డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చోబెట్టింది.

"ఇప్పుడే వస్తా"నని చెప్పి వెళ్ళింది. పావుగంటలో తిరిగి వచ్చింది. తలంటు స్నానం చేసిందేమో శుభ్రంగా కడిగిన



కర్పూరంలా మెరిసిపోతోంది. పాత సీత ఛాయలు ఆమెలో మళ్లీ చూడగలుగుతున్నాడు మోహన్. ఆ కళ్లలో ఇపుడు అహంకారం, హోదా లాంటివేవీ లేవు. ఆర్ద్రిత, దయా కన్పిస్తున్నాయి. తనని ఆహ్వానిస్తున్నట్లుగా వున్నాయి ఆ చూపులు.

మోహన్. సీత మెడ చూశాడు. తాళిబొట్టు మెరిసిపోతూ కన్పించింది. తనెంతగా దిగజారిపోయాడో ఇప్పుడు తలచుకొంటున్నాడు. దేవతలాంటి సీతని కాదనుకొని చెడతిరుగుతూన్న తన పరిస్థితి తనకే జుగుప్సాకరంగా గోచరించింది.

"అయితే హోటల్లోచేస్తావా భోజనం!" అంది ఎత్తిపొడుపుగా సీత.

"ఎందుకే ఆ బాబునలా ఎత్తిపొడుస్తావ్" అంది కాంతమ్మ విసుక్కొంటూ.

"నీకు తెలీదమ్మా! మోహన్ బాబు చాలా మారిపోయాడు. ఇంటి తిండి వంటపట్టదాయనకి" అంది సీత.

"ఏం తిక్కరేగ్గొట్టాలా?" అన్నాడు మోహన్, సీత పైపైకొస్తూ. గలగలా నవ్వింది సీత.

"ఇపుడు నీలో పాత మోహన్ కన్పిస్తున్నాడు" అంది పక్కన కూర్చుంటూ. భోజనాలు అయ్యాయి. తన రూం వైపు దారి తీసింది సీత. "కాసేపు పడుకో! తర్వాత తీరిగ్గా మాట్లాడుకుందాం" అంది.

"నాకు మరో పని లేదా! నేను వెళ్లిపోతాను" అన్నాడు మోహన్.

"అయితే వెళ్ళడానికే వచ్చావా" అంది అతని మొహంలోకి చూస్తూ. జావాబివ్వ లేదతను. తలుపు వోరగా వేసి మోహన్ దగ్గరగా వచ్చి కూర్చుంది సీత. అతన్ని చేతుల్లోనికి తీసుకొంది.

"కన్పించి, మళ్ళీ కలగా మారిపోతానంటే నేనేం చెప్పేది ? నన్ను మరిచి పోయావా మోహన్ ? ఈ తాళిబొట్టు చూశావా ? ఇది మెళ్ళో దాచుకున్నాను. నీ జ్ఞాపకాలు గుండెల్లో దాచుకున్నాను. ఇన్నాళ్ళుగా ఇలా గడపగలిగాను. అయితే ఇప్పుడు మరి నా వశం కాదు. నువ్వు లేకుండా నేను జీవించలేను" అంది అతని చేతుల్లో ముఖం దాచుకుంటూ. ఏడుస్తూన్న సీతని ఓదార్చడం తనకి చేతకాదనుకున్నాడు మోహన్.

"నిన్ను అసహ్యించుకొంటున్నానని అనుకొంటున్నావు కదూ! లేదు మోహన్ లేదు. నువ్వంటే నాకెప్పుడూ అభిమానమే. కాకపోతే నిన్నెందుకు చూసీ చూడగానే దగ్గరకు తీసుకోలేదని బాధపడుతున్నావా? నేను పాత సీతను కాను మోహన్. ఇపుడు డాక్టర్ సీతను. కొన్ని నియమాలు పాటించాలి. పైగా మనిద్దరం భార్యాభర్తలమన్న విషయం ఇంతవరకూ ఎవరికీ తెలీదు. మా అమ్మకి కూడా! అందుకని అలా ప్రవర్తించాను కాని, నిన్ను వదులుకోవాలని ఎంత మాత్రం కాదు. నిన్ను క్షణం చూడలేక బతకలేను" అంది అతన్ని చుట్టుకుపోతూ.

"నీ తోడు నాకు జీవితాంతం కావాలి" అంది అతని పొదివి పట్టుకొని. మోహన్ ఆనందంగా సీతని చూశాడు. సీత తన సీతేనని ధైర్యంగా వూపిరి పీల్చాడు.

"ఎన్నాళ్ళిలా అజ్ఞాతంగా మనిద్దరం ప్రవర్తించడం?'' అన్నాడు మోహన్.

"మరికొంతకాలం. ఒకరి మీద ఒకరికున్న అనుమానాలు పోవాలిగా'' అంది.

మోహన్ గతుక్కుమన్నాడు.

"నన్ను అనుమానిస్తున్నావా ?" అనడిగాడు.

''లేదు" అంది నవ్వి. బయటికి నడిచింది. తలుపుల దగ్గర తల్లిని చూసింది. కాంతమ్మ అంతవరకూ విన్న మాటల్ని మననం చేసుకొంటూ నిల్చుంది. తన వూహ నిజమైనందుకు సీతకినవ్వొచ్చింది.

* * *

సాయంత్రం నాలుగైంది—

కాంతమ్మ గదిలోనికి వెళ్ళి మోహన్‌ని లేపింది. భయాలూ, శంకలూ లేని నిద్ర మోహన్‌ని చాలాసేపు తన ఒడిలోకి లాక్కుంది.

"కాఫీ బాబూ!" అంది కాంతమ్మ మోహన్‌కి కాఫీ కప్పు అందిస్తూ. సీత దగ్గరగా వచ్చి కూర్చుంది.

"రేపట్నుండి ఈయన మనింట్లోనే వుంటాడు. మనకి మరో మనిషి తోడు. కాదు కాదు మరో మనిషి ఖర్చు ఎగస్ట్రా" అంది నవ్వుతూ. మోహన్ సీత వైపు చూశాడు.

"నిజానికి జగన్నాధం బాబు చేసిన సహాయానికి ఆ కుటుంబానికి మనమెంతో ఋణపడి వుండాలి" అంది కాంతమ్మ గతాన్ని నెమరువేసుకొంటూ.

"అవునవును. ఎంతో చెయ్యాలి! ఈయనగార్ని రాజుగారిని చేయాలి" అంది హేళనగా.

"ఎందుకమ్మా అయినవాళ్ళతో కూడా అంత హేళనగా మాట్లాడతావు" మందలింపుగా అంది కాంతమ్మ. "చూస్తున్నాను

భయంగా వుందిరా" అంటూ కాంతమ్మ తన అక్కసునంతా వెళ్ళగక్కేసింది.

"వాడికి పెళ్ళేమిటత్తయ్యా? దీన్ని బాగా వాడుకొందికి గొప్ప నాటకం ఆడాడు. మాష్టర్ ప్లాన్ బాస్టర్డ్‌ది. అయినా వాణ్ణి పట్టుకొని వేలాడ్డానికి దీనికి బుద్ధి ఉండద్దూ! పోనీ, నువ్వైనా చెప్పు వింటుందేమో! అయామ్ రడీ. నేను దాన్ని పెళ్లి చేసుకోడానికి ఎప్పుడూ రడీ. చెప్పి చూడు వింటుందేమో"

"వినదురా బాబూ! వినదు. అయినా ఇప్పుడు వట్టి మనిషి కూడాకాదు. మూడో నెల. అది చూసుకొని కిందా మీదా నిలవడం లేదు. ఈపాళాన ఆస్తంతా వాడికే ధారబోసేటట్టుంది."

"పిచ్చత్తా! నీకు లోకంపోకడ తెలీదు. దీపం వుంటుండగానే ఇల్లు చక్కదిద్దాలి! అలాగే డబ్బుంటుండగానే కాజేయాలి! ముందు జాగ్రత్తగా చేతికందింది అంకించుకో. లేకపోతే బికారిగా రేపు పడుండాల్సి వస్తుంది."

కూతురు గది వైపు చూసింది కాంతమ్మ. ఎక్కడ లేచి వస్తుందోనన్న భయం!

"మొన్న పాతికవేలు వాడి యేదాన కొట్టింది. ఎంత డబ్బుందో ఏమో చెప్పదు. అదిగో ఆ పెట్టెలో అంతా దాచేసి తాళం వేసుకొంటుంది. గొప్ప నెరజాణగా తయారైందీమధ్య" అంది.

నిద్ర నుండి లేచింది సీత.

కాఫీ తాగుతున్న నాగులు కన్పించటంతో దిగ్గున లేచి కూర్చుంది.

"ఎందుకొచ్చావు మళ్లీ?" అంది కోపంగా.

నాగులు నవ్వాడు ఆ మాటకి.

"దేవుడి దగ్గరికి భక్తుడెందుకొస్తాడు? అలాగే నేనూను"

"ఇది దేవాలయం కాదు. వెళ్లు ఇక్కణ్నుంచి" కసిరింది సీత.

"అపచారం. దేవుడు భక్తుణ్నెప్పుడూ తిప్పికొట్టడు. కొట్టకూడదు కూడా. అయినా అదంతా నాన్సెన్స్! అత్త కూతురంటేనే హక్కుంది. అందుకే నేనొచ్చాను."

"హక్కులూ, మర్యాదలూ నీకేం లేవు. గెటౌట్ ఫ్రం హియర్ ఫస్ట్" పళ్లు నూరుతూ అంది సీత.

నాగులు తదేకంగా సీతని చూశాడు.

"నన్ను కాదనకు సీతా! నువ్వే నా ప్రాణం. నువ్వే నా జీవం. నువ్వు కాదంటే నేనేమయిపోవాలి చెప్పు! ఆ వెధవని కట్టుకొని నువ్వు ఏ సుఖాలనుభవిస్తున్నావు? వాడు ఏ రకంగా నిన్ను ట్రీట్ చేస్తున్నాడో నీకు తెలీదు. నా మాటనమ్ము! వాడు మళ్లీ ఆ విజయవాడలో ఏ ఆడదాన్నో వళ్ళో వేసుకొని కులుకుతూ వుంటాడు. నీకు కన్పించదది. అలాగే నువ్వూ చెయ్యాలి. కుక్క కాటుకి చెప్పుదెబ్బలా జవాబివ్వాలంటే నువ్వు... నా ఒళ్ళో..."

నాగులు మాట పూర్తి కాలేదు. చెంప 'ఛళ్' మంది.

"హేవ్ కంట్రోల్ ఆన్ యువర్ టంగ్. మర్యాదగా మాట్లాడు. లేకపోతే పోలీసుల్ని పిలవాల్సి వుంటుంది" ఆవేశంతో రెచ్చిపోయింది సీత.

బుగ్గని తడుముకొన్నాడు నాగులు. బుసలు కొట్టాడు.

"నిన్నేం చేస్తానో తెలుసా?" అంటూ మీది కొచ్చాడు.

సీత ఫోను దగ్గరగా పరుగెత్తింది. రిసీవర్ అందుకోబోయింది. అంతలోనే

నాగులు అడ్డుగా వచ్చాడు. సీత చేతులు విరిచి పట్టుకొన్నాడు.

"నిన్నేం చేసినా పాపం లేదు. ఇదిగో ఇప్పుడే రుచిచూపిస్తాను" అంటూ ఆమె పెదవులు అందుకోబోయాడు. పెనుగులాడింది సీత.

కాంతమ్మ ఆందోళనగా పరుగెత్తుకొచ్చింది. అంతవరకూ నాగుల్ని భరించింది కాని, ఇప్పుడు భరించలేకపోయింది. వెళ్లి నాగులు వీపు మీద పిడికిలి బిగించి గుద్దింది. ఇద్దర్నీ విడదీసింది.

"నిన్ను సర్వనాశనం చేసేవరకూ నిద్రపోను" అన్నాడు నాగులు వెళ్తూ వెళ్తూ.

సీత డీలాగా నిలబడిపోయింది.

"వాడేదో నా మంచికి దగ్గరగా వచ్చాడనుకొన్నాను" అంది కాంతమ్మ.

"అది పామని నీకు తెలీదు. కావాలని పాలు పోసి పెంచుతున్నావు" తల్లి వంక కసిగా చూస్తూ అంది సీత. పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేసింది. ఇన్‌స్పెక్టర్ వస్తానని చెప్పాడు. వస్తూనే వివరాలన్నీ తెలుసుకొన్నాడు.

"వాడు మళ్లీ దౌర్జన్యం చేస్తాడని భయం. అందుకే మీకు ఫోన్ చేశాను" అంది సీత.

"వాడి విషయం మేం చూస్తాం! అయినా మీ జాగ్రత్తలో మీరుండండి. సాయంత్రం స్టేషన్‌కొచ్చి రిపోర్టు రాసి ఇవ్వండి" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

తలూపింది సీత.

"అయిందేదో అయింది. మళ్లీ స్టేషన్లూ, గొడవలూ దేనికి? అల్లరిపట్టిపోతాం" అంది కాంతమ్మ.

"నీకు తెలీదమ్మా! వాడెంతకైనా తెగిస్తాడు" సీత వ్యాకోషంగా అంది. ఆస్పత్రికి ఫోన్‌చేసి నాగులొస్తే లోనికి రానివ్వకండని చెప్పింది నర్సుతో.

నాగుల్ని పోలీసులు అరెస్టు చేశారు. ఓ నెలరోజులు జైల్లో వుంచి విడుదల చేశారు. ఆ కోపంతో సీత అంతు చూడాలనుకొన్నాడు నాగులు.

తనకెలానూ ఇక అందదు. అందని దాన్ని గురించి ఆశించకూడదు. మరి? తనది కానిదాన్ని నాశనం చేసితీరాలని నిశ్చయించుకొన్నాడతను.

మోహన్ వారానికొకసారి వచ్చిపోతున్నాడు. విజయవాడలో అతని ప్రవర్తన ఎలాంటిదో తెలుసుకోవాలనుకొంది సీత. మళ్లీ మరో పాతికవేలు తీసుకువెళ్లాడు. ఏం చేస్తున్నాడో చెప్పలేదు. గాబరాగా వుంది సీతకి.

పరిచయమున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్ని ఆరోజు కలిసింది.

"మావారు విజయవాడలో వుంటున్నారు. అతన్ని గురించి వాకబు కావాలి" అంది వివరాలన్నీ వివరంగా చెప్పి.

"మా ద్వారా మీకు అతని వివరాలు కావాలంటే, దానికి చాలా తతంగం ఉంది. అయినా పోలీసులు వెన్నంటుతున్నారంటే మనిషి భయపడతాడు. అందుకని ప్రైవేట్ వ్యక్తిని ఎవరినైనా గూఢచారిగా నియమించండి బాగుంటుంది" అని సలహా ఇచ్చాడు ఇన్‌స్పెక్టర్.

"నాకెవరూ పరిచయంలేరు. మీరే చూసిపెట్టండి" అంది సీత.

"'భగీరథ్' అని చిన్నసైజు డిటెక్టివ్ వున్నాడు. అతను రిటైర్డ్ సి. ఐ. డి. ఆయన్ని మీ దగ్గరికి పంపుతాను. మాట్లాడి చూడండి" అన్నాడు నవ్వుతూ.

'సరే'నని సీత లేచింది. రాత్రే భగీరథ్ సీతను కలుసుకొన్నాడు.

"మీకు ఏవిధమైన సమాచారం కావాలి?" అనడిగాడు.

"ఆయనిక్కడ వ్యక్తిగతంగా కొన్ని తప్పులు చేశాడు. అవి తెలియక చేశాడని నేను సరిపుచ్చుకున్నాను. ఇప్పుడు దూరంగా వున్నాడు. ఏం చేస్తున్నదీ తెలియడం లేదు. అతనొచ్చినప్పుడు ముఖాముఖిగా అడుగుదామనుకొంటే బాధపడతాడనే భయం. డబ్బును గూర్చి నేను ఆలోచించడంలేదు. కావాలనే ఖర్చు చేస్తున్నాను. అక్కడ ఆయన మళ్లీ నైతికంగా దిగజారిపోతే నేనుభరించలేను. ఆ విషయాలే మీరు తెలుసుకోవాలి" అంది సీత.

"తెలుసుకుని ఏం చేస్తారు?" అన్నాడు భగీరథ్.

"గతంలోలా మళ్లీ ప్రవర్తిస్తే అతనో కలిసి వుండాలా, లేదా అన్నది నిర్ణయించుకొంటాను"

"అలాగే అయితే" భగీరథ్ మౌనం వహించాడు కాసేపు. తర్వాత—

"ఆయన అక్కడే వుంటే ఆఫీసు అకౌంట్స్ లాంటివేవీ పరిశీలించడం సాధ్యం కాకపోవచ్చు" అన్నాడు.

సీత ఆలోచిస్తూ కూర్చుంది.

"నాకు డెలివరీ రోజులు దగ్గర పడ్డాయి. అతన్ని వారం రోజుల పాటు ఇక్కడ వుంచే ఏర్పాటు చేస్తాను. మీ ఇన్వెస్టిగేషన్ అప్పుడు చేయండి" అంది.

తలూపాడు భగీరథ్.

"మీ ఫీజెంత?" అనడిగింది సీత.

"ఇటువంటి కేసుల్ని డీల్ చేయడానికి త్రీ టు ఫైవ్ థౌజండ్సు ఛార్జ్ చేస్తాను" అన్నాడు నవ్వి.

రెండు వేలు అడ్వాన్సుగా ఇచ్చింది. వెళ్లిపోయాడు భగీరథ్

కాంతమ్మ విస్తుపోయింది సీత ప్రవర్తనకి.

"అతగాడి మీద నమ్మకం లేకపోతే వెనక్కి పిలిపిస్తే సరికదా! మళ్లీ డబ్బు ఖర్చు దేనికి" అంది తల్లి.

"ఆయన బాగుపడుతున్నదీ లేనిదీ తెలియాలిగా! చెడ తిరిగితే వెనక్కి పిలిపిస్తాను. లేదంటే అక్కడే వుంచుతాను. కాని... అమ్మా! నా డబ్బుతో నన్ను మోసం చేస్తుంటే మాత్రం చూసి వూరుకోలేనుగా" అంది బయటకి చూసి ఆలోచిస్తూ.

"అంతా అగమ్యగోచరంగా వుంది. నాగులన్నట్టు ఆ అబ్బాయిని కట్టుకొని సువ్వేం సుఖపడుతున్నావ్!అయినవాణ్ని కాలదన్నుకొన్నావు. కానివాణ్ని కళ్లకద్దుకొంటున్నావు. అంతా నీఖర్మ! ఈ వయసులో కూడా నాకీ చింతలు తప్పవు కాబోలు" కాంతమ్మ కంటనీరు పెట్టింది.

కూతురు విపరీతంగా డబ్బు ఖర్చు చేయడం ఆమెకు అయిష్టంగా వుంది. ఈ మూడేళ్లుగా సంపాదించిన డబ్బంతా నీటిపాలవడం కాంతమ్మ భరించలేకపోతోంది.

వారం రోజుల తర్వాత రానేవచ్చాడు మోహన్.

"మీరు ఓ వారం, పది రోజులు ఇక్కడే వుండండి! నాకు డెలివరీ సమయం. మీరు దగ్గరుంటే నాకేదో పిచ్చిధైర్యం" అంది సీత.

ఆమెను చిత్రంగా చూశాడు మోహన్. ఇంతవరకూ తనని 'నువ్వు' అని సంబోధించడం తప్ప, 'మీరు' అని సీత సంబోధించలేదు. కొత్తగా మాట్లాడు తోందనిపించింది. రోజుకొకసారయినా

పిల్లాడిగా ఆమె చేత మెట్టికాయ తినే మనిషి-హఠాత్తుగా ఎదిగిపోయాడనిపించి నవ్వుకొన్నాడు మోహన్.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

"నీ భాషను గురించి"

"ఏమయింది?"

"నన్ను గౌరవించి మాట్లాడుతున్నావు" అన్నాడు.

"భర్తకి గౌరవం ఇవ్వడం భార్య లక్షణం" అంది నవ్వుతూ.

"అయితే ఇంతకు ముందు భర్తను కానా?" చిలిపిగా ప్రశ్నించాడు మోహన్.

"కాదని ఎవరన్నారు? ఆరు సంవత్సరాల క్రితమే మీరు నా భర్త" సీత సిగ్గుపడింది.

మోహన్ ఆమెను చేతుల్లోనికి తీసుకొన్నాడు.

"ప్లీజ్!" వద్దన్నట్టుగా వారించింది నవ్వుతూ సీత.

మరో రెండ్రోజులకి సీత ప్రసవించింది. మగపిల్లాడు కలిగాడు.

మంచంలో నిస్తేజంగా పడున్న సీతను చూసి బాధపడ్డాడు మోహన్. లాలనగా ఆమె బుగ్గలు నిమిరాడు.

"బాబుని చూశారా?" అంది అతని కళ్లల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ.

"చూశాను. అంతా నా పోలికే" అన్నాడు.

"రూపు రేఖలయితే ఫర్వాలేదు. గుణాలు మాత్రం నావై వుండాలి" అంది కవ్వింపుగా సీత. మోహన్ నవ్వుకొన్నాడు.



"నాలాగే బాబుని డాక్టర్ని చేస్తాను" అంది.

"ముందుగానే ఏవీ వూహించకూడదు. నేనెంత అల్లరి చిల్లరిగా తిరిగినా నాకంటూ ఓ వ్యక్తిత్వం వుంది. అలాగే రేపు వాడి క్కూడ ఏవేవో వూహలుంటాయి. వాటిని కాదని నువ్వు ముందుకు పోకూడదు"

మోహన్ పెద్దమనిషిలా మాట్లాడడం విచిత్రమనిపించింది సీతకి. అతనిలో మార్పుకి సంతోషించింది. 'ఇలాగే ఈ మనిషి ఎల్లకాలమూ వుంటే జీవితం ఎంత హాయిగదా!' అనుకొంది తృప్తిగా.

మోహన్ విజయవాడ ప్రయాణమవుతున్నాడు ఆ రోజు—

"మరో రెండ్రోజులుండి వెళ్ళొచ్చు గదండీ! ఏమిటా తొందర? బాబు దగ్గరగా మీరు లేకపోతే నిద్రపోడు వాడు" అంది సీత నవ్వుతూ.

"మళ్ళీ వెంటనే వస్తాను. వచ్చి పది రోజులైంది. అక్కడ పరిస్థితులెలా వున్నాయో అర్థం గావట్లేదు"

సరేనంది సీత.

మోహన్ వెళ్ళిపోయాడు.

కాంతమ్మకి మనవడు అంటే వల్లమాలిన ప్రేమ ముంచుకొస్తోంది. ఎందుకో ఏమో అంతవరకూ కూతురి మీదున్న వ్యతిరేకత అంతా వూడ్చుకు పోయిందామెకి.

"పేరేమిటి పెడతారే?" అంది కూతుర్ని

"ఏమో! ఆయనిష్టం. ఆయనే నిర్ణయించుకొంటాడు. మనకెందుకు" అంది సీత హుందాగా.

"నిజమేలే" అంది తల్లి.

మనవణ్ణి చేతుల్లోకి తీసుకొంది. లాలించింది.

తన మీద తల్లికి ఉక్రోషం తగ్గినందుకు సీతకు సంతోషంగా వుంది. తను గోపీకి ఏరకమైన సాయం చేయలేదనీ, అందుకు తల్లి బాధపడుతున్నదనీ ఏనాడో గ్రహించింది. గోపీని దూరం చేయాలని తనేనాడూ వూహించలేదు. కాని, భర్తా, తమ్ముడూ ఒకటి కారన్నది ఆమె వూహించిన సత్యం. 'గోపీకి బతుకుతెరువు చూపిస్తే చాలదా' అన్నది ఆమె విశ్వాసం

మర్నాడే మోహన్ మళ్ళీ వచ్చాడు.

"మీరు విజయవాడ వెళ్ళి వచ్చారంటే నమ్మలేకపోతున్నాను" అంది సీత అతన్ని చూస్తూ.

"బాబుని చూడక వుండలేకపోతున్నాను" అన్నాడు.

సీత పొత్తిళ్ళలో బాబుని అందుకొన్నాడు.

"పేరేమిటి పెడతారు బాబుకి?" అంది.

"నువ్వే చెప్పు?"

"మీరే చెప్పండి? మిమ్మల్ని కాదంటానా"

ఒక్కసారిగా పరికిణీ, వోణీ వేసుకొనే ఆనాటి సీత సాక్షాత్కరించింది మోహన్ కళ్ళముందు. ఎందుకో నవ్వు తోసుకొచ్చిందతనికి.

నవ్వుతూ సీత కళ్ళల్లోకి చూశాడు. సిగ్గు పడిందామె.

"జానకిరావు అని పెడదాం"

"అదేం పేరు? పాత చింతకాయ పచ్చడిలా"

"అక్కడే వుంది కిటుకు! నేను వీణ్ణి 'జానకి' అని పిలుస్తాను. అంటే నిన్ను పిలుస్తున్నట్టు లెక్కేగదా! సర్వదా నీ నామ జపం చేసేవాడికి ఇంకేం పేరు తడుతుంది" అన్నాడు నవ్వి.

"సరే! దాన్నే మాండేట్ చేద్దాం.





నేను వాణ్ణి 'జానీ' అని పిలుస్తాను" అంది ఆనందంగా సీత.

"ఆపేరు కుక్కలకి పెట్టుకొంటారు" తమాషా చేశాడు.

"అయితే..." అని అర్థోక్తిగా ఆగి, అలిగింది సీత.

మోహన్ విరగబడి నవ్వాడు.

* * *

నాగులు తనని నాశనం చేయాలన్న తపనతో వున్నాడన్నవార్త సీతకి తెలిసినా నిర్లక్ష్యం చేసింది.

నాగులుకి సీత మీద విపరీతమైన కసిగా వుంది. చిన్నప్పుడు జల్సాగా, బతికాడు. అప్పటినుండి ఎవరిని లెక్క చెయ్యలేదు. తర్వాతర్వాత డాక్టర్ అయ్యాడు. కానీ సరైన ప్రాక్టీసు లేదు. పైగా వూర్లో నవ్వులపాలయ్యాడు. రాను రాను పూట గడవడం అసాధ్యమవుతోంది.

వ్యసనాలు మితిమీరుతున్నాయి. తనకు దక్కుతుందనుకొన్న ఆడది దక్కలేదు.దాంతో కక్ష పెంచుకొన్నాడు నాగులు. సీతను హతమార్చి అయినా సరే ఆమె డబ్బు తస్కరించాలను కొన్నాడు.

భగీరథ్ తాను సేకరించిన రిపోర్టులు అందించాడు సీతకి. అతనికి మరో రెండు వేలు అందజేసింది. ఆ విధంగా డబ్బు ఖర్చు కావడం బాధగావున్నా, మోహన్‌ను గురించిన పూర్తి వివరాలు సేకరించ వచ్చునని ఆశించింది.

భవిష్యత్తులో తమ మధ్య సంబంధాలు ఏ విధంగా వుండాలో నిర్ణయించుకో వచ్చునన్నది ఆమె అభిలాష. అప్పుడు తనెవర్ని ప్రేమించాలి? మోహన్‌నా, బిడ్డడ్నా అన్నది ప్రశ్న!

రాత్రి—

గదిలోకి వచ్చి తలుపులు వేసు కొంది సీత. వూయలలో బాబు హాయిగా నిద్రపోతున్నాడు.

బీరువాలోని రిపోర్టులను అందుకొంది. కుర్చీలో కూర్చుని ఒక్కొక్కటి చదువు తోంది. రోజువారీగా వివరాలు రాశాడు భగీరథ్. వరుసగా వున్నాయవి.

చదువుతోంటే కడుపులో చేయిపెట్టి కెలికినట్టుగావుంది. అంతా బాధామయంగా వుంది.

తన దగ్గర తీసుకొన్న ఏభై వేల రూపాయలూ నీళ్ళలా ఖర్చు చేసినట్టు తెలిసింది.

మోహన్ తన నవలలు నాలుగు పబ్లిష్ చేశాడు. ఆ నాలుగు చెరి అయిదు వేలుగా ముద్రించాడు. ఏజెంట్లకి అప్పుగా పంపాడు వాటిని. కొంచెం మాత్రమే మార్కెట్టయ్యాయి. మిగిలినవి గుట్టలుగా పడివున్నాయి. పేరున్న రచయితలవే వేయిపైగా పోనిది మోహన్ తనవెలా అన్నివేలు పోతాయను కొన్నాడో సీతకి అర్థంకాలేదు.

అతను వ్యాపారంలో నిలదొక్కు కుంటాడన్న ఆశ ఏమాత్రమూ లేదిక! డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చెయ్యడమే అతనికి తెలుసు. ఏడు నెలల్లో ఏభైవేల రూపాయలు ఖర్చు చేయడమనేది దుర్వి నియోగ మన్పించింది సీతకి.

ఖర్చయిన డబ్బు తిరిగి వస్తుందన్న నమ్మకం లేదు – ఆ రిపోర్టుల ప్రకారం. ఎన్నాళ్లిలా ఖర్చు చేస్తాడు? భవిష్యత్తును వూహించలేని వాడికి పెట్టుబడి పెట్టి ఏం లాభం?

తల్లడిల్లిపోయింది సీత.

గోపీ బాగోగులు చూడాలి. వాణ్ని అసలు పట్టించుకోవట్లేదని తల్లి భావిస్తోంది. పోతే పిల్లాణ్ని గురించి ఆలోచించాలి. తొమ్మిది నెలలు ప్రేమగా మోసి, కనిపెంచిన పిల్లాణ్ని రేపు బికారిగా రికామీగా తిరిగే వ్యక్తిగా చేయలేదు తను. వాడు డాక్టర్ కావాలి. తన ఆశయాలకి రూపు దిద్దుకోవాలి!

భర్త!

కొడుకు!

తమ్ముడు!

—ముగ్గురు గురించి తను కొనవూపిరి వరకూ పోరాడడం సాధ్యమా?

ఇలా ఆలోచించి లాభం లేదనుకొంది సీత.

నెలకి పదివేలు పైబడి తనకి ఆదాయం వుంది. భర్తకోసం ఆ డబ్బును వెచ్చించాలంటే బాధపడనవసరం లేదు. ప్రసుతానికి మరి కొంత కాలం ఇలాగే జరగనీ! ఇతర రచయితలవి ముద్రించకుండా మోహన్ తనవే పబ్లిష్ చేసుకోనీ!

అప్పుడు?!

మోహన్ తప్పక వెలుగులోకొస్తాడు. పేరున్న రచయితగా అతను పైకొస్తే వ్యాపారం లాభసాటిగానే జరగొచ్చనిపించింది.

సీత ఒకందుకు సంతోషించింది. మోహన్‌లో దుర్గుణాలు పునరావృతమై విజయవాడలో కూడా విచ్చలవిడిగా స్త్రీలోలుడై తిరుగుతాడనుకొంది. అయితే రిపోర్టుల ప్రకారం అతను అక్కడ ఏ ఆడదాన్ని చేరదియ్యలేదని తేలింది.

తృప్తిగా నిట్టూర్చి కుర్చీలో వెనక్కివాలి కళ్లు మూసుకొంది సీత. ఫ్యాను గాలికి చేతిలోని కాగితాలు రెపరెపలాడుతున్నాయి.

రాత్రి బాగా పొద్దుపోయింది—

తలుపులు చప్పుడయితే కాంతమ్మకి మెలుకువ వచ్చింది. లేచి, కళ్లు నులుముకొంటూ తలుపు తీసింది. జీరో బల్బు కాంతి మందకొడిగా వుంది.

తలుపు తోసుకొని నాగులు లోనికి వచ్చాడు.

అతనితోపాటు మరొకడు కూడా!

ఇద్దరూ పూర్తిగా తాగి వున్నారు. తూలుతున్నారు.

"సీత ఎక్కడ?"అనడిగాడు నాగులు కాంతమ్మని.

ఆ సమయంలో నాగుల్ని చూస్తేనే కాంతమ్మకి భయం వేసింది. పూర్తి నిషాలో వున్నారు—ఏం చేసినా చెయ్యొచ్చననుకొంది. అయినా - "లేదు" అంది ఖచ్చితంగా. ఏ ప్రశ్నకి అది జవాబో తనకి అర్థం కావడం లేదు.

"వుంది! సీత వుంది! డబ్బూ వుంది! డబ్బులాంటి సీతా వుంది! సీతలాంటి డబ్బూ వుంది. రెండూ ఇంట్లోనే వున్నాయి. నాకు తెలుసు" అంటూ నాగులు ఇంట్లోకి జొరబడ్డాడు. కాంతమ్మ గాబరాగా అరుస్తోంది.

సీత కుర్చీలో నుండి లేచి తేరుకోక ముందే—

నాగులు ఆమె ముందు ప్రత్యక్షమయ్యాడు. ఆమెను లేవకుండా గట్టిగా పట్టుకొని కూర్చోబెట్టాడు.

"పిచ్చిపిల్లా! ఎక్కడికే నీ పరుగు? అందనంత కాలం అందకుండా ఎలానూ పూరించావు.ఇప్పుడు... అందిపోయావు! నౌ యూ ఆర్ ఇన్‌మై హేండ్స్!కూర్చో"

సీత భయం భయంగా నాగుల్ని చూసింది. తర్వాత ధైర్యం కూడదీసు




కాని—

"ఏమిటీ దౌర్జన్యం! మళ్లీ పోలీసులకి ఫోన్ చెయ్యనా" అంది.

"వద్దు.పోలీసులకీ,మనకీ చుక్కెదురు. ప్రస్తుతానికి వాళ్లతో నాకు పనిలేదు కూడా. పనిపడితే పిలుద్దువుగాని... మర్యాదగా బీరువా తాళాలిటు పడెయ్యి!"

"ఎందుకు?" అరిచింది సీత.

పెద్దగా నవ్వాడు నాగులు.

"ఎందుకా? డబ్బు...డబ్బు కోసం! ముందు తాళాలిస్తే అందులో డబ్బు దోచుకుంటాను. ఆ తర్వాత నీ చీరె ఇచ్చేస్తే నిన్ను దోచుకుంటాను"

"మర్యాదగా వెళ్లు. లేకపోతే..." సీత పట్టు సడలింపు కోసం ప్రయత్నించింది.

"ఏం చేస్తావు! చంపుతావా? వద్దు. నువ్వు నన్ను చంపొద్దు. నేనే నిన్ను చంపేస్తాను"

"నీ బెదిరింపులకి నేను భయపడను" శక్తినంతా కూడదీసుకుంటూ మాట్లాడుతోంది సీత. అంతే—

చెంప 'ఛెళ్'మంది. సీత కళ్ళకి బైర్లు కమ్మాయి.

"ఇదే శాంపిల్! దట్సాల్. ఇవ్వకపోతే ఏం జరుగుతుందో అనడానికి ఇది మచ్చు మాత్రమే"

"చచ్చినా ఇవ్వను" అంది సీత. బలాన్నంతా ఉపయోగించి అతని బిగింపు నుండి బయటపడాలని ప్రయత్నం చేస్తోంది.

ముందు ప్రాణం రక్షించుకోవాలి! తర్వాత పోలీసులకు ఫోన్‌చేయాలి!

పెనుగులాడుతోంది సీత. చేతిగాజులు చిట్లి రక్తం కారుతున్నా లెక్కచేయక అతడి పట్టు సడలించుకుని ఊపిరి పీల్చింది. వెంటనే నాగుల్ని కసిగా కొట్టింది.

నాగులుకి మత్తు దిగుతోంది.

"నిన్నేం చేసినా పాపంలేదు" అంటూ ఆవేశంగా సీత రెచ్చిపోతోంది. అదును చూసి ఆమె చేతులుపట్టి కిందకు లాగాడు నాగులు. వెల్లకిలా పడింది. కడుపుమీద కాలువేసి నొక్కిపట్టాడు.

"మర్యాదగా తాళాలిచ్చేయ్! వెళ్ళిపోతాను"

అడ్డంగా తలూపింది సీత. గింజుకొంది. ఒడుపుగా తప్పుకుని పరుగెత్తి టెలిఫోన్ అందుకుంది.

ఆతర్వాత ఏం జరుగుతుందో నాగులుకి సుస్పష్టంగా తెలుసు. ఏమీ సాధించలేదన్న అవమానం! అతన్ని నిలువెల్లా కాల్చివేసింది.

చంపేయాలి! సీతని చంపేయాలి!

అదే తృప్తి!

అదే శాంతి!

నాగులు ఆ విధంగా ఆలోచించేడు.

పరుగెత్తుకొని వెళ్ళి సీతను వెనక్కి జాడించి లాగాడు. వెనక్కి తూలి పడింది.

కత్తి తీశాడు నాగులు. దానివైపు కసిగా ఓసారి చూసి సీత వెన్నులో పొడిచాడు.

ఒకటి!

రెండు!!

మూడు!!!

సీత భయంకరంగా అరిచి నేలకొరిగింది.

నాగులు పారిపోయాడు.

కూతుర్ని చూస్తూ గగ్గోలుగా ఏడుస్తోంది కాంతమ్మ.

"అమ్మా! ఆస్పత్రికి ఫోన్‌చేసి వేగంగా నర్సుని పిలువ్. రక్తం పోకుండా

కట్లు కట్టాలి" అంది బాధగా సీత. కాంతమ్మ 'ఫోన్' అనే మాటనే మరిచి గాబరాగా బయటికి పరుగెత్తింది. మళ్ళీ రెండు నిమిషాల్లోనే తిరిగొచ్చింది. వెంట నర్సుతోసహా అయిదారుగురు వ్యక్తులు న్నారు.పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేయడంతో ఇన్‌స్పెక్టర్ పరుగున వచ్చాడు.

"ఏం జరిగింది?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రిపోర్టు రాసుకొందుకు సిద్ధ పడుతూ. జరిగినదంతా సీత వివరించి చెప్పింది.

"ఆస్పత్రికి తీసుకెళ్లండి త్వరగా" అన్నాడు. తనే గవర్నమెంట్ ఆస్పత్రికి ఫోన్‌చేసి అంబులెన్స్ పంపమన్నాడు.

పది నిమిషాల్లో ఆస్పత్రికి చేర్చారు. డాక్టర్లంతా సీతని బతికించడానికి ప్రయత్నం చేశారు. మోహన్‌కి ట్రంకాల్ చేసి పిలిపించారు.

గోపీకి ఈ విషయం తెలిసిన తక్షణం పరుగెత్తుకొచ్చాడు.

ఉదయం పదిగంటలయింది.

డాక్టర్లు బతుకుతుందన్న ఆశ లేద న్నారు. సీతకి ఆ విషయం ముందే తెలుసు.

తనిక బతకదు!

స్పెషల్ రూంలో వుంది సీత. మోహన్ పక్కగా కూర్చున్నాడు.

"నేనిక బతకను కదూ!" అడిగింది సీత.

మోహన్ మౌనంగా కూర్చున్నాడు. ఏడుస్తున్నాడు. అతని కన్నీరు ఆమె బుగ్గల మీదుగా పడి చారికలు కడుతున్నాయి.

"బాబు ఎక్కడ?" అంది తిరిగి.

"కాంతమ్మ దగ్గరున్నాడు" మోహన్ జవాబిచ్చాడు.

"నాకో సహాయం చేస్తారా"

"చెప్పు సీతా! ఏం చెయ్యమంటావు?" ఆందోళన చెందాడు.

"నాగులు ... నాగులుగాణ్ని మీరు చంపి తీరాలి"

"తప్పకుండా. సీతా ! వాడి అంతు చూస్తాను. నీకు మనశ్శాంతి కలుగ జేస్తాను" ఆవేశంతో అరిచాడు.

"ఇంకొకటి"

ఏమిటన్నట్టుగా చూశాడు మోహన్.

"ఇంటికి వెళ్లి బీరువాలో బాంక్ చెక్స్, పాస్ పుస్తకాలున్నాయి. అవి వెంటనే తీసుకురండి"

తీసుకొచ్చి అందించాడు.

ఏభై వేల రూపాయలకి చెక్ రాసి అతడి చేతికిచ్చింది.

"ఇది బాబు కోసం! ఫిక్స్‌డ్ డిపాజిట్ చెయ్యండి ! వాడు మేజర్ అయ్యే వరకూ ఈ డబ్బు ఎవరూ తీసుకొనే వీలుండ కూడదు. ఆ ఏర్పాటు చెయ్యండి ! మీ మీద నమ్మకం లేదని .. నేనిలా ప్రవర్తించటం లేదు. నా బాబు బాగోగులన్నీ ఇవాళా, రేపే చూసుకోవాలి నేను. ఎల్లుండి నేనుంటానో వుండనో-వెళ్లండి"

బాబు పేరు మీదుగా డబ్బు జమ చేశాడు. వాడి పేరుతో వున్న సర్టిఫికార్డు తీసుకొని సీత దగ్గరికొచ్చి వాటి నందించాడు ఆమెకి.

ముందుగా కార్డుని ముద్దుపెట్టుకొంది సీత.

"ఓ తల్లిగా నా బాధ్యతతీరిపోయింది" అంది తృప్తిగా.

తర్వాత గోపీని పిల్చింది.

"అమ్మని జాగ్రత్తగా చూసుకో! బుద్ధిగా చదువుకో! డాక్టర్‌వి కావాలి నువ్వు" అంటూ ఏభై వేలకి చెక్ రాసి




తమ్ముడి చేతికందించింది.

తల్లిని దగ్గరగా పిలిచింది.

"తమ్ముడంటే నాకు అభిమానం లేదనుకున్నావు కదూ!" అంది సీత.

కాంతమ్మ వలవలా ఏడిచింది.

మోహన్ దుఃఖాన్ని దిగమింగుకోలేక పోతున్నాడు. అతని చేతిని తన చేతుల్లోకి ప్రేమగా తీసుకొంది సీత.

"మీకు నేనేమి ఇవ్వగలను?" అంది చిన్నగా నవ్వుతూ.

"సీతా!" ఏడుస్తున్నాడతను.

"మీకోసం నా సర్వస్వాన్నీ ధార పోశాను. మీది కానిదంటూ నా దగ్గర ఏమీలేదు" అంది వెక్కిళ్ళగా దుఃఖిస్తూ. తర్వాత అతని చేతిలో ఏభై వేలకు పైగా చెక్ రాసి వుంచింది.

"ఇదేం చేసుకోను?" అమాయకంగా ప్రశ్నించాడు మోహన్.

"పెళ్లి చేసుకొని, మీరూ-మీ భార్యా సుఖంగా వుండండి''

"సీతా !" ఆమె చేతిని గట్టిగా పట్టుకొన్నాడు.

"ఏం! తప్పేముంది?"అందినవ్వుతూ.

"నన్ను హింసించకు సీతా!" మోహన్ బతిమలాడాడు.

"పిచ్చిమోహన్! నువ్వుసుఖపడాలనే? నేనీ పని చేసింది ! నాకు తృప్తి కలగాలంటే నువ్వు మరో పెళ్లి చేసుకోవాలి''

"సీతా!"

"ఆవేశపడకు!" అంది చిరునవ్వుతో.

ఒంటి గంటకి డాక్టర్ వచ్చాడు. కళ్ళతోనే పలకరించిందతన్ని.

"చివరిగా నాదో కోరిక డాక్టర్"

"చెప్పమ్మా!"

"నా ఆస్పత్రిలోనే నేను చనిపోవాలని కోరుకుంటున్నాను. పర్మిషన్ ఇవ్వండి సార్ వెళ్లిపోడానికి" అంది.

డాక్టర్ అయిష్టంగానే అంగీకరించాడు.

చివరికి ఘడియల్లో వున్నానని సీతకి తెలుసు. అందుకే మోహన్‌ని విడిచి ఓ క్షణం కూడ వుండలేపోతోంది. చివరి చూపువరకూ భర్తని చూడాలన్న ఆశ!

''ఈ తాళిబొట్టుతోనే నన్ను కడ తేర్చండి''

"ఇది నాది ! నా స్వంతం ! దీని మీద సర్వహక్కులూ నావే" అంది తిరిగి.

మోహన్ చేతిని గుండెమీదుగా చేర్చుకొంది. అతని కళ్ళల్లోకి అప్యాయంగా చూసింది. ఏవేవో క్రీనీడలు కన్పిస్తున్నాయి.

"నేను అందంగా వున్నానా మోహన్''

అంది సీత నవ్వుతూ హఠాత్తుగా.

ఆ ప్రశ్నకి జవాబు ఏమని చెప్పాలో తెలీని అయోమయ స్థితిలో మోహన్ ఉన్నాడు.

"చెప్పు మోహన్ ఎలా వున్నాను?" అంది రెట్టించి.

"అందంగా వున్నావు"అన్నాడు.

"కాదు !"

"చందమామలా వున్నావు"అన్నాడు ఏడుస్తూ.

"ఊహుఁ" తల అడ్డంగా వూపింది సీత. తర్వాత తనే-

"చందమామలోని రాణీగారిబొమ్మలా వున్నాను! అవునా?" అంది నవ్వుతూ.

చిన్ననాటి జ్ఞాపకాలు - సంఘటనలూ ఒకొటొకటిగా గుర్తు వస్తున్నాయి.

నవ్వుతోంది సీత.

నవ్వుతూనే ప్రాణం విడిచింది. ★



**1740** నవంబర్ 29 ఆరోజు.

ఆరోజు లండన్‌లోని టైబర్న్ జైల్లో నేరస్థులని వురితీస్తున్నారు. మొత్తం అయిదుగుర్ని. వారిలో పదిహేడేళ్ళ విలియం డ్యూయెల్ అనే దొంగ కూడా ఉన్నాడు.

అతన్ని ఉరికంబం ఎక్కించారు. జైలర్ సంజ్ఞ ననుసరించి అతని కాళ్ళ కింద ఉన్న చెక్కని లాగేశారు. ఇరవై నిముషాలసేపు అతను ఉరికంబంమీద నించి మెడచుట్టూ బిగుసుకున్న తాడుతో వేలాడాడు.

తర్వాత అతను మరణించినట్లు సర్టిఫికేట్ ఇవ్వడానికై శవాన్ని పరీక్షించడానికి డాక్టర్ వచ్చాడు. మామూలు ప్రకారం అతని శవాన్ని నీళ్ళతో కడుగుతుంటే, ఆ 'శవం' వూపిరి పీలుస్తుండటం




గుర్తించారు కాంపౌండర్లు.

వెంటనే అతని శవం నుండి రక్తాన్ని బయటకి తీసాడు డాక్టర్. ఎలాంటి రోగానికయినా రక్తం శరీరంలోంచి బయటకి తీయడం, పరీక్షించడం అప్పట్లో ప్రతీ వైద్యుడు చేసేవాడు.

కాని మరో రెండు గంటల తర్వాత శవంగా మారిన సదరు విలియండ్యాయెస్ లేచి కూర్చున్నాడు! అప్పుడతను మాట్లాడ లేనంత నీరసంగా ఉన్నాడు.

డాక్టర్ ఆ సంగతి జైలు అధికారికి

వార్త పంపాడు. జైలు అధికారి విలియంని మళ్లీ ఉరితీయడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఈ సంగతి లండన్ ప్రజలకి తెలిసింది. జైలు చుట్టూ గుంపులు గుంపులుగా జనం గుమిగూడారు. విలియంని మళ్లీ ఉరితీసే పక్షంలో జైలు అధికారిని కూడా ఉరి తీస్తామని బెదిరించారు వాళ్లు. జైలు అధికారి విలియంని అతని సెల్‌కి పంపించి ఏంచేయాలని పై అధికారులకి కబురు పంపాడు. సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కి, డ్యూక్ ఆఫ్ న్యూ కేజిల్‌కి ఏం చేయాలో పాలుపోక తమకి జరిగినదంతా రాత పూర్వకంగా రిపోర్ట్ పంపాలని, అందాకా విలియంని ఉరితీయకూడదని ఉత్తరువు పంపారు.



మర్నాడు లండన్‌నించి వెలువడే దిన పత్రికలన్నీ ఈ విషయం గురించి ప్రముఖంగా ప్రచురించాయి. కొందరు విలియంతో అబద్ధపు ఇంటర్వ్యూలు కూడా ప్రచురించారు. ఉరినించి వేలాడే ఆ 20 నిముషాలు అతను చాలా దెయ్యాలను చూసినట్లుగా వర్ణించారు కూడా.

విలియం ఉరితీసినా ఎందుకు బతికే వున్నాడో చెప్పలేకపోయారు వైద్యులు. అతని బరువు సరిపోక ఉరితాడు మెడ చుట్టూ సరిగ్గా బిగుసుకుని ఉండదని భావించారు కొందరు. అదనంగా 50 పౌండ్ల బరువుని అతని కాళ్లకి కట్టి ఉరితీస్తే మరణిస్తాడని చెప్పారు వారు.

జ్వరంలో ఉండగా అతను ఉరితీయబడటంతో, దాని ప్రభావంతో రక్త ప్రసరణ అధికంగా జరిగి ఉరి పనిచేసి ఉండదని మరి కొందరు వైద్యులు భావించారు.

బ్రిటిష్ రాజు తన స్వంత వైద్యులని అసలు కారణం ఏమిటో కనుక్కోవలసిందిగా కోరాడు. వాళ్లు పరిశోధించి ఉరితాడు మెడచుట్టూ సరిగ్గా బిగుసుకునేలాగా ఏర్పాటు చేయలేదని తేల్చారు.



కారణం ఏదయినా, విలియం డ్యూయెల్ మరోసారి ఉరితీయబడకూడదని నిర్ణయించాడు బ్రిటన్ రాజు.

అతన్ని అమెరికాలోని న్యూ ఇంగ్లండ్ కాలనీకి పంపించారు ఆ తర్వాత.

* * *

అమెరికాలోని న్యూ ఓర్‌లీన్స్ ప్రాంతంలో గత శతాబ్దంలో సేమ్యూల్ డోంబే అనే శవాలని పాతడానికి గోతులు తవ్వే పనివాడు ఉండేవాడు. వృత్తిపరమైన ద్వేషంతో అతన్ని మట్టుపెట్టాలని నిర్ణయించారు మిగతా గోతులు తవ్వే పనివారు.

సేమ్యూల్ మిగతా వాళ్ళకన్నా తక్కువ ధరకి గోతులుతవ్వుతూండటంతో అంతా అతన్నే ఆపనికి నియమించేవారు.

మిగతా వారికి పని దొరికేది కాదు. అదీ అసలు కారణం.

ఓరోజు కొత్తగా గోతిని తవ్వుతున్న సమయంలో కొద్ది దూరంలోని పొద వెనక నుండి పెద్ద శబ్దం రావటం విన్నాడు సేమ్యూల్. నిజానికి అతన్ని చంపడానికి అక్కడ దాక్కున్న ఒకతను తుపాకీ పేల్చటంవల్ల వచ్చిన ధ్వని అది. అయితే అది పాత తుపాకీ అవటం వల్ల తుపాకీలోని మందు పేలి గుండు బయటకి రాకపోగా అది ఆ తుపాకీనే పేల్చేసింది. ఫలితంగా ఆ పేల్చిన వ్యక్తి మర్నాడు చేతికి బేండేజీతో మొహాన ప్లాస్టరుతో కనబడ్డాడు సేమ్యూల్‌కి. ఆ తర్వాత ఓ మధ్యాహ్నంపూట సేమ్యూల్ నిద్రపోయే చిన్న పాకలో అతని మంచం కింద ఓ కూజానిండా మందుగుండు సామగ్రి కూరి అతను నిద్రపోతుండగా దాన్ని రహస్యంగా అంటించారు.

అది పేలగానే-ఆ పాకలోని సామాను మొత్తం ధ్వంసం అయిపోయింది. మంచం మీద పడుకునున్న సేమ్యూల్ ఎగిరెళ్ళి 20 అడుగుల దూరంలో పడ్డాడు. కాని చిన్న గాయాలు తప్ప అతనికి ఎలాంటి హాని జరగలేదు. ఆ దెబ్బతో పోలీసులు అతనికి 'నాశనం చేయబడలేనివాడు' అనే నిక్‌నేమ్ పెట్టారు.

కొద్ది రోజుల తర్వాత ముఖాన ముసుగులున్న కొందరు ఓ అర్ధరాత్రివేళ అతన్ని బంధించి ఓ పడవలోకి తీసుకెళ్ళి దాన్ని సరస్సు మధ్యలో ఆపి అతని కాళ్లు, చేతులు తాళ్లతో బంధించి నీళ్లలోకి తోసేసారు.

కాని, మృత్యుదేవత మూడోసారి కూడా సేమ్యూల్‌ని కరుణించింది. అతను పడ్డ ప్రాంతంలోనీరు కేవలం రెండడుగుల లోతేవుంది. ఫలితంగా కట్లు విడిపించుకుని



బయటపడ్డాడు సేమ్యూల్.

నాలుగోసారి సేమ్యూల్ ఇంటికి నిప్పంటించారు శత్రువులు. అతను బయటకి పారిపోతూంటే, ఛాతీమీద తగిలేలా తుపాకీ పేల్చారు. అది చూసి నిప్పు ఆర్పడానికి వచ్చినవారు సేమ్యూల్‌ని ఆస్పత్రికి తరలించారు. మరణిస్తాడనుకున్న సేమ్యూల్ మళ్లీ బతికి బయటపడ్డాడు. కొన్ని వారాల తర్వాత ఆస్పత్రి నుండి డిశ్చార్జి చేసారు అతన్ని.

ఇప్పుడు అతని శరీరం నిండా గాయాల తాలూకు గుర్తులే. అయినా సేమ్యూల్ చలించకుండా తక్కువ ధరకి గోతులు తవ్వుతూనే వున్నాడు.

అయితే ఆ తర్వాత శవాలని పూడ్చే గోతులని తవ్వేవాళ్ళయూనియన్ ఒకటి

ఏర్పడి అందరికీ సమానంగానే ప్రతిఫలం ముట్టసాగింది. అంతటితో అతన్ని చంపే ప్రయత్నాలు విరమించుకున్నారు తోటి పనివారు. విశేషమేమంటే సేమ్యూల్ తన శత్రువులందరికన్నా ఎక్కువ కాలం జీవించి 1905లో తన 98వ ఏట సహజమయిన మరణం పొందాడు.

* * *

అమెరికాలోని ఫ్లోరిడాలో వున్న ఓ జైల్లో జిమ్ విలియమ్స్ అనే హంతకుడిని 1926 నవంబర్ 20వ తారీకున ఎలక్ట్రిక్ కుర్చీలో కూర్చోపెట్టారు. కాళ్ళని,చేతులని కుర్చీకి కట్టి ఎలక్ట్రిక్ షాక్స్ తగిలే ఎలక్ట్రోడ్‌లని అతని శరీరానికి అమర్చారు. తలమీద నల్లగుడ్డతో చేసిన సంచీని తొడిగారు.

వార్డెన్‌కి శిక్షపడ్డ విలియమ్స్ మీద సానుభూతి వుంది. సరయిన ఆధారం లేకుండా అతనికి మరణశిక్ష విధించారని వార్డెన్ నమ్మాడు. షెరీఫ్ మాత్రం విలియమ్స్ హంతకుడనే నమ్మాడు.

వార్డెన్ లివర్‌లాగి విలియమ్స్‌ని చంపడం నా బాధ్యత కాదన్నాడు. షెరీఫ్ కూడా అది తనది కాదన్నాడు. "విలి



విలియమ్స్‌కి, మరికొన్ని క్షణాల్లో తన శరీరంలోకి విద్యుత్తు ప్రవహించి తనని చంపేస్తుందని తెలుసు. ఆ క్షణం కోసం ఎదురుచూడసాగాడు. మరణశిక్ష పడ్డ విలియమ్స్.ఆవిధంగా 20 నిముషాలు ఎదురు చూసాడు. కాని ఏమీ జరగలేదు. ఆలస్యానికి కారణం అర్థంకాలేదు అతనికి.

అదే సమయంలో బయట ఆ జైలు వార్డెన్, షెరీఫ్ చర్చల్లో ఉన్నారు. ఎలక్ట్రిసిటీని పంపే లివర్‌ని ఎవరులాగాలి అన్నది తేలలేదు వారిద్దరికి.

యమ్స్ హంతకుడని నమ్ముతున్నావు కాబట్టి ఆపని నువ్వే చెయ్యి'' అని వార్డెన్ అంటే "అది నా డ్యూటీ కాదు. నీ పని" అన్నాడు షెరీఫ్.

అలా ఓ 20 నిముషాల సేపు ఆలస్యం అయింది. ఇది తెలియని విలియమ్స్ ఎలక్ట్రిక్ కుర్చీలో కూర్చుని తన మరణం కోసం ఎదురు చూడసాగాడు. చివరికి ఎవరూ లివర్ లాగకపోవడంతో విలియమ్స్‌ని తిరిగి అతన్ని సెల్‌కి తీసుకెళ్లారు. లివర్ ఎవరు లాగాలో పై అధికారులని సంప్రదించారు.

వారు ఆలోచించి 20 నిముషాలుగా అతను మృత్యుముఖంలో వుండటంతో మనసులో చాలా బాధ అనుభవించి వుంటాడు కాబట్టి అతని శిక్షని మరణ శిక్ష నించి యావజ్జీవ కారాగార శిక్షకి తగ్గించారు.

ఆ తర్వాత విలియమ్స్ మంచితనాన్ని గుర్తించిన వార్డెన్ అతనికి బయట స్టేట్ ఫారంలో పనిచేసే అవకాశం కూడా కల్పించాడు.

1934 జూలైలో ఓ రోజు విలియమ్స్ బయట పొలంలో పనిచేస్తూంటే పక్క పొలంలో ఇద్దరు యువతులు భయంతో అరవడం విన్నాడు. అటుచూస్తే ఓ బలిష్టమయిన ఆంబోతు కొమ్ములని నేల మీద పొడుస్తూ రంకెలు వేస్తోంది. అది ఆ ఇద్దరు యువతుల మీదకి వెళ్లబోయే సన్నాహంలో ఉందన్న మాట.

విలియమ్స్ క్షణం ఆలస్యం చేయకుండా కంచె దాటి, తన చొక్కా విప్పి ఆంబోతు వైపు పరిగెత్తి తన చొక్కాని దానికి కనబడేలా ఆడించాడు. అది ఆ యువతులని వదిలి విలియమ్స్ చొక్కా మీదకి దూకింది. విలియమ్స్ ఆ చొక్కాని దూరంగా పట్టుకుని తప్పించుకుందామనుకున్నాడు. కాని కుదరలేదు.

ఆంబోతు తల అతనికి తొడమీద తగిలి గాలిలోకి లేచాడు. అదృష్టవశాత్తు ఎగిరి కంచె ఇవతల పడ్డాడు విలియమ్స్. కొద్దిపాటి దెబ్బలతో తప్పించుకున్నాడు.

విలియమ్స్ రక్షించిన ఆ ఇద్దరు యువతులలో ఒకరు తనని మరణశిక్ష నించి రక్షించిన వార్డెన్ భార్య, మరొకరు అతని కూతురు అని తెలిసింది ఆ తర్వాత.

సత్ప్రవర్తనకి విలియమ్స్‌ని జైలు నుంచి విడుదలచేసారు వెంటనే.

* * *

'హత్య' అనేది సాధారణంగా విషంతోనో, ఆయుధంతోనో జరుగుతూంటుంది. ఆ ఆయుధం కత్తికావచ్చు. కారు కావచ్చు. కాని తనంతట తాను ఏ ఆయుధం కానీ, విషంగానీ వుపయోగించి చంపకపోయినా న్యాయస్థానంలో అనేకమందిని జడ్జీలు



హంతకులుగా నిర్ణయించడం అమెరికాలో జరిగింది.

న్యూ జెర్సీలోని ఓ న్యాయస్థానం తన భార్యని చితకబాదుతానన్నందుకు ఒకతన్ని హంతకుడిగా నిర్ణయించింది. ఆ భార్య తన భర్త నిజంగా తంతాడనే భయంతో పారిపోయి నీళ్ళలోకి దూకి

మునిగి మరణించింది. న్యాయస్థానం ఆమె మరణానికి బాధ్యుడిగా చేసింది ఆ భర్తని.

ఓ పెట్రోల్ బంక్‌లోకి ఓ దొంగ వెళ్ళి దోచుకోబోతూంటే అక్కడ పని చేసే కుర్రాడు తుపాకీతో ఆ దొంగని కాల్చబోయాడు. పొరపాటున ఆ గుండు దొంగకి కాక మరొకరికి తగిలింది. ఆ కుర్రాడిని కాక ఆ దొంగని హంతకుడిగా నిర్ణయించింది పెన్సిల్‌వేనియాలోని ఓ కోర్టు. "ఓ నేరస్థుడివల్ల జరిగిన సంఘటనవల్ల ఎవరయినా మరణిస్తే ఆ సంఘటనలకి బాధ్యుడైన ఆ నేరస్థుడే హంతకుడవుతాడు" అన్నారు జడ్జీలు.

ఇడాహోలోని న్యాయమూర్తి అనేక సార్లు టెలిఫోన్ చేసినందుకు ఓ వ్యక్తిని హంతకుడిగా నిర్ణయించాడు. "హతుడు జీవించి వుండాలంటే ఆయన ఆరోగ్య పరిస్థితి దృష్ట్యా ఆయనకి నిద్ర చాలా అవసరం అని తెలిసీ నీవు రాత్రంతా ఆయనకి ఫోన్‌చేసి నిద్రపోనివ్వకుండా చేశావు. అది హత్యకిందే లెక్క. తుపాకీ బదులు ఫోన్ వుపయోగించబడింది ఈ కేసులో అంతే!" అన్నాడా న్యాయమూర్తి.

పెన్సిల్‌వేనియాలోని న్యాయమూర్తే మరో కేసులో తీర్పు ఇస్తూ ఇలా వివరించాడు. "నేరస్థుడు తన భార్యని కొట్టడంతో ఆమె వైద్యం కోసం డాక్టర్‌ని



పిలిచింది. డాక్టర్ బ్రాందీ తాగమనటంతో తాగింది. అయితే పొరబాటున ఆ బ్రాందీ కడుపులోకి బదులు వూపిరితిత్తులలోకి వెళ్లడంతో మరణించింది. భర్త కొట్టిన దెబ్బ బ్రాందీ తాగాల్సిన అవసరం కలిగించింది కాబట్టి, తాగడం, దెబ్బతగలక పోతే వుండేది కాదు కాబట్టి ఆ భర్తే హంతకుడు" అన్నాడు న్యాయమూర్తి.

ఓ వ్యక్తి మరో వ్యక్తిపై తుపాకీ

పేల్చాడు. మరణించబోతూ ఆ మరో వ్యక్తి తన దగ్గరున్న తుపాకీతో తనని తనే మళ్లీ కాల్చుకుని మరణించాడు. మొదట చంపడానికి ప్రయత్నించిన వ్యక్తి తుపాకి గుండువల్ల హతుడు మరణించకపోయినా అతన్ని హంతకుడిగా నిర్ణయించాడు కాలిఫోర్నియాకే చెందిన మరో న్యాయమూర్తి.

"ఆత్మహత్య కోసం కాల్చుకున్న గుళ్ల అతన్ని త్వరగా చంపేశాయి కాని, లేకపోతే హంతకుడు కాల్చిన గుండు కూడా హతుడిని కొద్దిగా ఆలస్యంగా చంపివుండేది. కాబట్టి అతను హంతకుడే" అని తీర్పు ఇవ్వబడింది.

* * *

1870 ప్రాంతాలలో అమెరికాలో ఉరి తీయడంలో ఎంతో క్రూరత్వం ప్రదర్శించేవాళ్లు. ముఖ్యంగా ప్రజలు ఏ నేరాలు తగ్గాలనుకుంటారో అలాంటి నేరాలని చేసే దోషులని అమానుషంగా వురి తీసేవారు.

డాడ్జ్ సిటీలో గుర్రాలను దొంగిలించడం అలాంటి నేరం. గుర్రాల దొంగ దొరికినప్పుడు అతనికి మరణశిక్ష విధించబడితే, ఊరిబయట వున్న 'కాటన్ వుడ్స్' అనే చోటికి తీసుకెళ్లేవారు.

అక్కడ వున్న ఓ పెద్దచెట్టు కొమ్మలని వురి తీయడానికి ఉపయోగించేవారు. వాటినించి సదా ఓ పది, పన్నెండు తాళ్లు వేలాడుతుండేవి. కొన్నిటికి ఇంకా అస్థిపంజరాలు వేలాడుతుంటే, మరి కొన్నిటి కింద నేలమీద వురితీయబడ్డవారి ఎముకలు పడివుండేవి.

గుర్రాలని దొంగిలించిన నేరస్థుడిని ఆ చెట్టుకిందకి తీసుకువచ్చి, అతను దొంగిలించిన గుర్రం మీద కూర్చోబెట్టేవారు. రెండు చేతులని వెనక్కి విరిచి తాడుతో బలంగా కట్టేవారు. తర్వాత వురిని అతని మెడకి బిగించేవారు.

సాధారణంగా ఆ తర్వాత గుర్రాన్ని తోలేస్తారు. గుర్రం కదిలి ముందుకు వెళ్లిపోవడంతో నేరస్థులు చెట్టు కొమ్మకి కట్టిన తాడునించి వేలాడి, గొంతు చుట్టూ వురి బిగిసుకుని మరణిస్తారు.

కాని అప్పట్లో వాళ్లు గుర్రాన్ని తోలేయకుండానే తమ దారిన తాము వెళ్లిపోయేవాళ్లు!

అప్పుడు గుర్రంమీద కూర్చున్న నేరస్థుడు మృత్యువు కోసం ఎదురు చూస్తూ క్షణక్షణం నరకం అనుభవించేవాడు. ఆ గుర్రంమీద కూర్చుని వున్నంతవరకు తను బతికే వుంటాడు. అది కదిలితే వురి తీయబడతాడు. రాత్రి అవుతుంది క్రమంగా. నిద్ర వుండదు ఆ నేరస్థుడికి రాత్రంతా. దూరంగా తోడేళ్లు, నక్కల అరుపులు వినబడతాయి. వాటికి భయపడి గుర్రం వెళ్లిపోతే? తెల్లవారితే దారినపోయేవాళ్లు ఎవరయినా చూసి, జాలిపడి రక్షిస్తారనే ఆశ కూడా మిణుకు మిణుకు మంటూంటుంది. సూర్య కిరణాలు ఒంటిని కాల్చేస్తాయి. త్వరగా రాత్రయితే బావుండుననుకుంటాడు మళ్లీ.

గుర్రానికి కూడా దాహం వేస్తుంది. ఆకలి వేస్తుంది. తన ఒంటిమీద వున్న బరువుకు విసుగు పుడుతుంది.

చివరికి గుర్రం కదులుతుంది.

ఈ భయంకర శిక్ష ఫలితంగా ఆ తర్వాత డాడ్జ్ సిటీ చుట్టుపక్కల గుర్రాల దొంగలు పూర్తిగా తగ్గిపోయారు.

—మల్లాది

మదకరీంద్రాన్ని ఎంచక్కా లొంగదీసుకున్నాడీ బాల టార్జాన్ ! ఇంతా చేసి ఈ బుడుతడి వయసు ఎనిమిదేళ్లే !







ఏమిటి ఈ అసహ్యకరమైన పని అనుకుంటున్నారా ?... 'కాదది కరి శృంగార కాండ సుమండీ' అంటున్నాడు మన ఫొటోగ్రాఫర్.



పక్కా శాకాహార 'గోచాల'కు ఈ కవచం ఏమిటంటారా? మోటు సరసాని కెవరూ దిగకుండా ఉండాలనే ఈ రక్షణ కవచం.



బాబోయ్ ! ఇవన్నీ నేను పెట్టినవేనా ? ఇవన్నీ నేను పొదగాల్సిందేనా" అని ఆశ్చర్యపోతూ అంతలోనే దిగాలుపడుతున్నట్టున్నారు ఈ 'కుక్కుటేశ్వరం'గారు.



మైక్రోస్కోప్స్ కావివి. అంధులకు చూపునివ్వగల కొత్తరకం కళ్ళజోడు. దీని ఖరీదు 48 వేల రూపాయలు మాత్రం.



ఇంగ్లండులోని ఓ "మీసాల క్లబ్బు" ఛైర్మన్‌గారీయన. 71 ఏళ్ల వయసున్న ఈయనగారి ఈ మీసాల వయసు 42 సంవత్సరాలు. వాటి పొడవు అయిదున్నర అడుగులని సగర్వంగా చూపుతున్నాడీ 'మీస సామ్రాట్'







మనిషికో సర ఆట్లాడి, ఆట్లాడి బుఱ్ర వేడెక్కినట్లుంది పెద్దమనిషికి.
ఇంకేం...! ఓల్ బాటిల్ ! ఆ తర్వాత...ఇదే !

'డాండెలియన్' జాతికి చెందిన అపురూపమైన శునకరాజమిది. బ్రిటన్ మొత్తం మీద ఇలాంటిది ఇది ఒక్కటే.

బుల్ ఫైట్ గోదాలోకి సరదాగా దిగితే జరిగే శాస్తి ఇదే.



ఇంత చక్కని పూదోటలో మనకీ అడ్డంకులేమిటి? అంటూ బరితెగిం
నట్లున్నాయీ శునక సుందర, సుందరీమణులు.



సరదాగా మ్యూజియంకు వెళ్లిన శునక బాలకు ఎదురయింది సంతోషమా? భయమా ? అనేది ఆ బొమ్మలు కదిలితేగానీ తేలదు.

ఒడ్డెక్కిన ఈ సరుకుల ఓడలోంచి బయటపడింది అదొక్కటే ననుకో నక్కర్లేదు. అందరూ క్షేమమే!

భూతదయ అంటే ఇదేనండీ! ఈ 'స్టార్క్'గారు గూడు కట్టి గుడ్లు పొదుగుతూంటే ఎలక్ట్రీషియన్ వచ్చి వైర్లు సరి చేస్తున్నాడు దానికి తగలకుండా.

# వాకింగ్ ఛాంపియన్

ఈ రోజుల్లో ప్రాముఖ్యత లేని విషయమంటూ లేదు. కడుపు నిండిన వారికి అన్నీ విశేషాలే. 28 ఏళ్ల జార్జ్ మిగాన్ దక్షిణ అమెరికా నుంచి అలంగా వరకు వున్న 18,500 మైళ్ల దూరాన్ని కాలి నడకన ప్రయాణించాలని నిర్ణయించుకున్నాడు. ఇప్పటి వరకూ దాదాపు 12,504 మైళ్ల దూరాన్ని 1558 రోజుల్లో నడిచేశాడు. బ్రిటన్‌లోని కెంట్‌కి చెందిన జార్జ్ వివాహితుడు. ముత్యాల్లాంటి ఇద్దరు పిల్లలు వున్నారు.

అతను తన ప్రయాణాన్ని 1976 జనవరి 31న ప్రారంభించాడు. అదేమంత నల్లేరు మీద బండిలా సాఫీగా జరగలేదు. మధ్యలో అర్జెంటీనాను దాటడానికే 13 నెలలు పట్టింది. ప్రయాణ సమయంలో బ్రెడ్, చిన్న ఉల్లిపాయలు తింటుంటాడు. అవి కూడా దొరక్కపోతే బల్లులు ఊసరవెల్లులను సైతం కాల్చుకు తిన్నాట్ట.

ఈ సుదీర్ఘ ప్రయాణంలో ఎల్లప్పుడూ అవసరమయ్యే 11 పౌన్ల బరువుగల సామానును మోయాల్సి వచ్చేది. దీనిలో ప్రథమ చికిత్స సాధనాలు, తన అనుభవాలను రాయడానికి నోట్ బుక్, పెన్సిళ్లు, ప్రాణరక్షక మందులు వుండేవి. ఇతను రోజుకి 25 మైళ్ల చొప్పున ప్రయాణిస్తాడు. వర్షాకాలంలో విశ్రాంతే. ప్రతి 6 నెలలకి ఒకసారి ప్రయాణం ఆపి అనుభవాలను రాస్తుంటాడు.

ఒకసారి పనామా గుండా ప్రయాణించేటపుడు ఓ దొంగల గుంపు దాడికి గురై కొన్ని వస్తువులను పోగొట్టుకున్నాడు. ఇటీవల తీవ్రంగా జబ్బు పడినా తన ప్రయాణాన్ని కొనసాగించాలనే కృతనిశ్చయంతో వున్నాడితను. ప్రయాణ





సమయంలో ఎవ్వరినీ డబ్బు కోసం యాచించడు. ఎవరన్నా ఇచ్చినా తీసుకోడు. అభిమానులు ఇచ్చిన ఆహార పదార్థాలను మాత్రం అందుకుంటాడు. గమ్యం కేసి సాగుతున్న ఈ వాకింగ్ ఛాంపియన్ ప్రయాణం పూర్తయ్యాక జపాన్‌లో స్థిరపడదామనుకుంటున్నాడు.

## దేవుడితో బాతాఖానీ

కొందరు దేశపాలకులు రాజకీయ చతురులే కాక హాస్యప్రియులూ, సంభాషణా చతురులూ కూడా అయివుంటారు. ఈ



మధ్య ఇజ్రాయిల్ ప్రధాని బెగిన్, అమెరికా అధ్యక్షుడు రీగన్ కలుసుకున్నప్పుడు వైట్ హౌస్‌లో పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. అప్పుడు బెగిన్ అమెరికా అధ్యక్షుడి టేబిల్ మీద తెలుపు, నీలం, ఆకుపచ్చ రంగుల్లో మూడు టెలిఫోన్లుచూసి "ఇన్నిరంగుల టెలిఫోన్లు పెట్టుకున్నారేఖిటి?" అనడిగాడురీగన్‌ను. రీగన్ సమాధానంగా "తెల్లరంగుఫోను బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్‌తో డైరెక్టుగా మాట్లాడటానికి, నీలం రంగు ఫోను ఫ్రెంచిప్రధాని మిట్టరాండ్‌తో డైరెక్టుగా మాట్లాడడానికి, ఇక మూడోది దేవుడితో బాతాఖానీ వేయడానికి" అని వివరించాడు.

బెగిన్ "అయితే ఆ మూడో ఫోన్ను తరచూ ఉపయోగిస్తుంటారా?" అనడిగాడు పరిహాసంగా,

"అదెలా కుదురుతుంది. దేవుడు మాకు చాలా దూరాననివసిస్తున్నాడుగనక ఫోన్‌లో మాట్లాడాలంటే తడిపి మోపెడు ఖర్చవుతుంది. అసలే నాబడ్జెట్‌లో ఎన్నో కోతలుండగా ప్రతిరోజూ దేవుడికి టెలిఫోన్ చేసేంత స్తోమత నాకెక్కడిదీ?" అన్నాడు రీగన్. అక్కడితో ఆ సంభాషణ ముగిసింది.

తర్వాత కొన్నాళ్ళకి రీగన్ ఇజ్రాయిల్‌ను సందర్శించాడు. రీగన్ బెగిన్‌తో సంభాషిస్తూ టేబిల్ మీదతనదగ్గరవున్న ప్లే

మూడు రంగుల్లో వున్న టెలిఫోన్లను చూశాడు. అలా ఎందుకు పెట్టుకున్నాడో తెలుసుకుందామని బెగిన్‌ను అడిగాడు.

బెగిన్ "ఆ మొదటి ఫోను ఈజిప్టు అధ్యక్షుడు సాదత్‌తో పిచ్చాపాటి మాట్లాడటానికి, రెండోది బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్‌తో మాట్లాడటానికి, ఇక మూడోది దేవుడితో కబుర్లేసుకోడానికి: దేవుడితో నేనురోజూ మాట్లాడతాను" అన్నాడు.

ఆశ్చర్యపోయిన రీగన్ "దేవుడితో మాట్లాడాలంటే చాలా ఖర్చవుతుందికదా? రోజూ ఎలా మాట్లాడగలుగుతున్నారు?" అనడిగాడు. "ఏముందీ, జెరూసలేం మా పక్కనే వుంది కదా. అందుకని యేసు క్రీస్తుతో నేను రోజూ మాట్లాడతాను" అని జవాబిచ్చాడు బెగిన్.

## రక్షణ ఖర్చులు

పాత రికార్డుల్ని అధిగమించి కొత్త లక్ష్యాలను చేరుకోవాలని అందరిలాగే మనదేశం కూడా ప్రయత్నించి ఈ మధ్య ఓ పాత రికార్డును బద్దలుకొట్టి కొత్త రికార్డు నెలకొల్పింది. అదేమిటంటే ఈ ఏడు మనదేశ రక్షణ బడ్జెట్ 4200కోట్ల రూపాయలకి చేరటం. ఈ మొత్తాన్ని యుద్ధేతర కార్యక్రమాలకు ఖర్చుచేస్తే ఆశ్చర్యకరమైన ఫలితాలుంటాయని గణాంక నిపుణులు సెలవిస్తున్నారు.

ఈ 4200 కోట్ల రూపాయలనూ గృహ నిర్మాణం మీద ఖర్చుచేస్తే దేశజనాభాలోని ప్రతి ఐదు మందిలో ఒకరికి ఒక గదిగల ఇళ్లు లభిస్తాయి. ఒక్కో జాగర్ యుద్ధ విమానం ఖరీదుతో 5 కోట్లకు పైగా బడికెళ్ళే పిల్లలకు ఒక్కొక్కరికి రెండు నోటు పుస్తకాలూ, అచ్చు పుస్తకాలూ పంచిపెట్టవచ్చు. ఒకసబ్‌మెరైన్ ఖరీదుతో 2 లక్షల గ్రామాలకు పరిశుభ్రమైన తాగే నీటిని సమకూర్చవచ్చు. టాంకులను కొనడానికయ్యే ఖర్చుతో 12,500 గ్రామాలలో ప్రాథమిక విద్యాసౌకర్యాలు కల్పించవచ్చు. హెలికాప్టర్ల ఖరీదుతో 12 వేల ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులకు ఒక నెల జీతం ఇవ్వవచ్చు.

మనదేశం ప్రతిఏడూ యుద్ధవిమానాల నిర్వహణకు చేస్తున్న ఖర్చుతో 10 వేల టన్నుల గోధుమలను కొని దేశజనాభాలో ఐదో వంతు మందికి 10 రోజులపాటు ఆహారం పంచవచ్చు. అనుత్పాదక రక్షణ పథకాలకు అయ్యే ఖర్చుతో 35 టెలిఫోన్ ఎక్స్ఛేంజీలను స్థాపించి 1లక్షా 65 వేల మందికి టెలిఫోన్ సౌకర్యం కల్పించ వచ్చు. ఈ విషయాలు పాలకులకు చక్కగానే తెలిసివున్నా 'నలుగురితోపాటు నారాయణా' అని ఆయుధాల పరుగు పందెంలో పాల్గొంటున్నారు.

## సారా పెట్రోలు

పెట్రోలు దొరక్క వస్తున్న ఆధునిక ప్రపంచం చాలా కాలం నుంచి సరైన ప్రత్యామ్నాయం కోసం వెతుకుతూనే వుంది.

మద్రాసు గిండీ ఇంజనీరింగ్ కాలేజ్ ప్రొఫెసర్ జగదీశన్ 'ఇథనాల్'తో కారు నడిపి విజయం సాధించేడు. సారాయి నుంచి తయారయ్యే 'ఇథనాల్' కార్లు, లారీల కంటే స్కూటర్ల వంటి రెండు చక్రాల వాహనాలకి చాలా ప్రయోజనకారి అంటున్నాడీయన. ఇథనాల్ పెట్రోలుకన్నా చవకగా దొరకడమే

 

కాకుండా వాతావరణ కాలుష్యాన్ని కూడా తగ్గిస్తుందని ఇతని అభిప్రాయం. వాహనాల పికప్ కూడా పెట్రోలుతో పోలిస్తే చాలా ఎక్కువగా వుంటుందనీ, కొన్ని చిన్న చిన్న ఇబ్బందులున్నా కాలక్రమేణా పరిష్కరించుకోవచ్చనీ హామీ ఇస్తున్నాడీయన. ఈ లెక్కన ఇహ దేవదాసులు పాపం ఏం తాగి బతుకుతారోగదా!

# నేరము-శిక్ష

మద్రాసులోని కొరుక్కుపెట్టామ్ ప్రాంత పోలీస్ డెప్యూటి కమీషనర్ సుబ్బయ్యగారు మామూలుగానే ఉదయం 10 గంటలకి తనకార్లో బయల్దేరారు. ఆ రోజున భారీవర్షం పడటాన రోడ్డుమీద, రోడ్డు పక్కలా అక్కడక్కడా నీళ్ల నిలిచి వున్నాయి. ఎంత జాగ్రత్తగా కారు నడిపినా టైర్లు బురదలో దిగబడి బురద చిందుతోంది. ఆవిధంగా రోడ్డుపక్కన నిలబడివున్న సెల్వామ్ అనే 13 ఏళ్ళ కుర్రాడి మీదకుకూడా చిందింది ఆబురద. దాంతో ఒళ్ళుమండిపోయిన ఆ పిల్లవాడు ఓ రాయి తీసుకుని కారుమీదకు బలంగా విసిరాడు.

ఆ పిల్లవాడు చేసినపనికి పోలీసు ఆఫీసరు కోపం తెచ్చుకోలేదు. ఆ పిల్లవాడిని జాగ్రత్తగా గమనించాక దగ్గరికి పిలిచి "ఎక్కడ చదువుతున్నావ్" అనడిగాడు.

పిల్లాడు "నేను స్కూలుకెళ్ళను" అన్నాడు.

"కారుమీద అలా రాయి విసరడం మంచిది కాదు" అన్నాడు పోలీసాఫీసరు నచ్చచెబుతూ.

"అయితే నువ్వు నామీద బురద చల్లడం మంచిపనా? పైగా నాకున్న ఒకే ఒక షర్ట్‌ను పాడుచేశావు" కోపంగా, రోషంగా అన్నాడా పిల్లవాడు. అతగాడు అనాథుడై వుంటాడనిపించి కారెక్కమన్నాడు పోలీస్ ఆఫీసర్. మొదట్లో భయపడినా చివరికి కారెక్కాడు సెల్వామ్. ఇంతకు ముందున్న కోపమంతా పోయి ఈయనగారు తననేం చేస్తారోనన్న భయంతో గట్టిగా ఏడ్చాడు.

పోలీసాఫీసర్ అతన్ని ఓదార్చి "ఏదన్నా ఉద్యోగం ఇప్పిస్తే చేస్తావా?" అనడిగాడు. పిల్లాడు తలూపాడు. పోలీసాఫీసరు వాకబు చేసి ఓ హోటల్లోచిన్న ఉద్యోగం ఇప్పించాడు. టిఫిన్లు, భోజనం పెట్టి నెలకి 15 రూపాయలివ్వడానికి అంగీకరించాడు. జీతం సెల్వామ్ పెంపుడు తల్లికి ఇచ్చే ఏర్పాటు జరిగింది.

"బురద పడిందన్న కోపంతోనే సెల్వామ్ తన కారుమీదకి రాయివిసిరాడు. రేపు అతను పెరిగిపెద్దయ్యాక కూడా ఇలాగే వ్యవహరిస్తే చిల్లర నేరస్తుల్లో కలిసి





## మీ చేతుల్లో ఒదిగిపోయే తారామణిహారం
## మీ కన్నుల్లో వెలుగులు చిమ్మే దివ్వెల తోరణం

- చలనచిత్ర పరిశ్రమలోని ప్రతి రంగం గురించి సమగ్రమైన సమాచారాన్ని అందిస్తుంది 'సితార'

- ఆబాలగోపాలాన్ని తన అందచందాలతో ఆకర్షిస్తుంది 'సితార'

- రంగుల ముఖచిత్రాలతో, అభిమాన తారల వర్ణచిత్రాలతో, తాజాతాజా ఖబుర్లతో మిమ్మల్ని మురిపించే మరిపించే అంశాలతో, ఎన్నెన్నో విశేషాలతో వారం వారం వెలువడుతుంది 'సితార'

# సితార

సమగ్ర సినీ వారపత్రిక

రూపాయి మాత్రమే

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాదు-500004

పోయి సమాజవ్యతిరేకశక్తిగా తయారవటం ఖాయం. అవకాశం వున్నప్పుడు అలాంటివారికి ఏదో పని చూపిస్తే పోలీసు శాఖ బరువు ంత తగ్గుతుంది" అని ఆలోచించే ఆఫీసరు వాడికి ఉద్యోగం ఇప్పించానన్నారు ఆ ఆఫీసరుగారు ఆతర్వాత. దేశంలోని పోలీసులందరూ ఇలాగే ఆలోచిస్తే నేరస్తుల సంఖ్య ఇంత పెరిగేది కాదేమో!

# ఆత్మహత్యా ద్రవం

కొందరు బెదిరించటానికి "ఛస్తున్నా, ఛస్తున్నా!" అంటారేగాని నిజంగా చావరు. ఒకటి రెండు నిద్ర మాత్రలు మాత్రమే మింగి ఎలాగో బతికి బయట పడుతుంటారు. కాని అందరూ అలా కాదు. కొందరు చేసేదేదో గప్‌చుప్‌గా చేసేస్తారు. ఇలా ఆత్మహత్యలు చేసుకోబోయే వారిని ముందుగా కనిపెట్టడం సాధ్యమేనా అంటే 'ఆహా' అంటున్నారు వైద్య నిపుణులు.

ఫలానా ఎల్లమ్మ, ఫలానా పుల్లయ్య భవిష్యత్తులో ఆత్మహత్య చేసుకుంటారు అని ముందుగానే చెప్పవచ్చునని బల్లగుద్ది మరీ చెపుతున్నారు వారు.

అమెరికన్ నిపుణులు ఇందుకు ఓ మార్గాన్ని కనుగొన్నారు. ప్రతి వ్యక్తికీ వెన్నుపూసలో ఒక రకమైన ద్రవం వుంటుంది. ఈ ద్రవంలో 'హియా' అని పిలవబడే ఒక రసాయనిక పదార్థం వుంటుంది. ఒక వ్యక్తిలో ఈ 'హియ' అనే పదార్థం ఎంత మొత్తంలో వుందో కొలవడం ద్వారా ఆ వ్యక్తిలో ఆత్మహత్య చేసుకొనే ధోరణి వుందో లేదో నిర్ణయించవచ్చునంటున్నారు వారు.

వెన్నుపూసలో వున్న ఆ ద్రవాన్ని సిరంజి ద్వారా తీసి రసాయనికంగా పరీక్ష చేస్తారు. ప్రామాణికమైన కొలతల కన్నా ఆ ద్రవంలోని రసాయన పదార్థాలు తక్కువగా వుంటే ఆ వ్యక్తిలో ఆత్మహత్య చేసుకొనే ధోరణి ఉన్నట్లే.

అలాగాక మామూలుగా వుండవలసిన స్థాయిలోనే వుంటే అతను ఆత్మహత్య చేసుకొనే అవకాశాలు లేవన్నమాటే.

'కెరండన్' అని పిలువబడే మెదడులో వుండే ఒక రసాయనిక పదార్థానికీ, వెన్నుపూసలోని ఈ ద్రవానికీ ప్రత్యక్షసంబంధం కూడా వుందట.

ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''ఈనాడు భాషాస్వరూపం''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలనీ ఆశించే వారందరికీ ఉపయోగపడుతుంది.

వెల రు. *25.00*

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

ప్రతులకు:

ఉషోదయా పబ్లికేషన్స్
ప్రయివేట్ లిమిటెడ్
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,
హైదరాబాద్ – 500 004.

# 'అనాథ' రచయిత

ఫ్రాన్సిస్ కెసీని అనాథాశ్రమంలోంచి ఓ కాంపౌండర్ దత్తు తీసుకొని పెంచుకున్నాడు. అప్పుడతని వయసు 14 సంవత్సరాలు. కాని ఫ్రాన్సిస్ కెసీకి తన పెంపుడు తండ్రి నచ్చలేదు. ఉద్యోగం చేస్తూ స్వతంత్రంగా బతకాలనుకుని ఓ రోజు పారిపోయాడు. రోడ్లు ఊడ్చేవాడుగా, క్లర్కుగా, వంటవాడిగా చిన్నా చితకా ఉద్యోగాలనేకం చేస్తూ బతికాడు.

పట్టుదలతో పనిచేసి 20 ఏళ్లకే లక్షాధికారి అయ్యాడు. ఈ డబ్బంతా అతను ఎయిర్ లైన్స్ వ్యాపారంలో సంపాదించాడు. కానీ వచ్చిన ఆ సిరి వచ్చినట్లే జారిపోయి మూడేళ్ళలో నయాపైసా లేని నిరుపేద అయిపోయాడు.

తర్వాత ఫ్రాన్సిస్ ఓ ఉద్యోగంలో చేరాడు. అప్పట్లో యూనివర్సల్ పిక్చర్స్ వారు తీసే చిత్రాలన్నింటినీ చూసేవాడు. అవి చూశాక ఆ సినిమా కథలకన్నా



బ్రహ్మాండమైన కథలు రాయగలనని అన్పించి, రచనా వ్యాసంగంలోకి దూకాడు. అతను రాసిన మొట్టమొదటి నవల 'నెవ్వర్ లవ్ ఎ స్ట్రేంజర్'. అదృష్టం మరోసారి ఫ్రాన్సిస్‌ను వెతుక్కుంటూ వచ్చింది. అతని నవలలకు విపరీతమైన పేరువచ్చి కోట్ల సంఖ్యలో కాపీలు అమ్ముడు పోయాయి. ఈ నవలల్లో ముఖ్యంగా ప్రేమే ఇతివృత్తం అయినా ఫ్రాన్సిస్ కెసీకి 40వ ఏట గానీ నిజమైన ప్రేమ స్వయంగా అనుభవంలోకి రాలేదు. ఈ వయసులోనే ఇతనికి గ్రేసి అనే ఓ ఇటాలియన్ అమ్మాయితో పరిచయమై ప్రేమించుకొని పెళ్ళి చేసుకున్నారు. సిరి సంపదలు అతని కాళ్ల దగ్గరకే వచ్చి పడుతున్నాయి. అయినా అతనికి సంతోషం లేదు. తాను అనాథనన్న భావన పోలేదు. అందుకే తన అసలు తల్లిదండ్రులకోసం ఇప్పటికీ అన్వేషిస్తున్నాడు.

ఫ్రాన్సిస్ కెసీ వయసిప్పుడు 65 సంవత్సరాలు. ఎప్పటికైనా తన తల్లిదండ్రులను కనుగొనగలనన్న నమ్మకం ఇంకా వుందతనిలో. ఈ ఫ్రాన్సిస్ కెసీ ఎవరబ్బా అనుకుంటున్నారా? మీకు బాగా తెలిసిన పెద్దమనిషే. ప్రపంచ పాఠకులను ఆకట్టుకున్న ప్రఖ్యాత రచయిత హెరాల్డ్ రాబిన్స్ ఈ ఫ్రాన్సిస్ కెసీ. హెరాల్డ్ రాబిన్స్ అనేది అతడి కలంపేరు.

**Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.**

